## <u>ఒకే</u> ఉతుకులో 3 దశలుగా పనిచేసి...




# డెట్ బట్టలను ఎక్కువ తెల్లగా ఉతుకుతుంది

—ఏ యితర పౌడరు కంటె

### <u>ఎలా చేస్తుందో ఎందుకు చేస్తుందో చూడండి:</u>

1వ. దశ : **డెట్** లోగల ఒక ప్రత్యేకమైన పదార్థము బట్టలోనికి త్వరగా చొచ్చుకొనిపోయి; బాగా అంటుకొని ఉన్న మట్టిని కూడ వదలిస్తుంది—బట్టలు శుభ్రపడతాయి.

2వ. దశ : **డెట్**. మట్టిని వదలించిన తరువాత దానిని బట్టకు మళ్ళీ అంటుకోకుండా చేస్తుంది—దుస్తులు శుభ్రపడతాయి, శుభ్రముగా ఉంటాయి.

3వ. దశ : **డెట్** బట్టలకు అదనపు తెల్లదనమును కలిగిస్తుంది—బట్టలు పూర్వము కంటె ఎక్కువ తెల్లగా ఉంటాయి! (నీలి లేక తెలుపుచేసే పదార్థమును చేర్చనక్కర లేదు)

SHILPI HPMA 38A/70 TEL

**డెట్‌ను నేడే కొనండి!**

స్వస్తిక్ ఆయిల్ మిల్స్, బొంబాయి



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

---

ఈ సంచిక నుంచి "శివపురాణం" అట్ట చివరి బొమ్మగా ప్రచురిస్తున్నాము. "రహస్యవ్యక్తి" [బేతాళ కథ]లో అందరికీ పనికి వచ్చే నీతి ఒకటి ఉన్నది. డబ్బువల్లనో, పదవుల వల్లనో గొప్పవాళ్ళయేవారిలో నిజంగా గొప్పతనం ఉన్నట్టు మనం భ్రమ పడతాం. కాని మనుషుల గొప్పతనమూ, కొద్దితనమూ నిజంగా ఉండేది వారి అసలు స్వభావాలలోనే.

---

సంపుటి 48 ఫిబ్రవరి '71 సంచిక 2





# శత్రునాశనం

ఒకప్పుడు కామరూపదేశానికీ, నేపాళ దేశానికీ మధ్య ఎడతెగని శత్రుత్వం వుండేది. కామరూప సైనికులు ముఠాలు ముఠాలుగా వచ్చి, అంతగా రక్షణలేని నేపాళపు సరిహద్దులో ఉన్న గ్రామాలను కొల్లగొట్టి పోతూ ఉండేవారు.

ఇలా ఒక సారి ఇరవైమంది కామరూప సైనికులు సరిహద్దుదాటి, కొండ మార్గాన నేపాళంలోకి వచ్చి, ఒక గ్రామంలో సంపన్నుడి ఇంట గొప్పగా వివాహం జరగబోతున్నదని విన్నారు. కాని ఆ గ్రామాన్ని చేరాలంటే ఏ దారిన వెళ్ళాలో, అసలా గ్రామం ఏ దిక్కుగా ఉన్నదో వారికి తెలియలేదు.

ఇంతలో వారి కొక కొండచరియలో ఒక గొర్రెలకాపరి గుడిసె కనిపించింది. అందులో ఒక గొర్రెలకాపరి ఒంటరిగా నివసిస్తున్నాడు. కామరూపులు అతన్ని, "ఫలాని గ్రామం ఎక్కడ ఉన్నదో నీకు తెలుసునా?" అని అడిగారు.

"తెలుసు," అన్నాడు గొర్రెలకాపరి.

"ఇవాళ అక్కడ గొప్పవాళ్ళింట పెళ్ళి జరగబోతున్నదిట. నిజమా?" అని వాళ్ళు మళ్ళీ అడిగారు.

ఆ సంగతి ఈ ద్రోహులకు తెలిసినందుకు లోపల విచారిస్తూ గొర్రెలకాపరి, "నిజమే," అన్నాడు.

"మేము అక్కడికి వెళ్ళాలి. మాకు దారి తెలియదు," అన్నారు కామరూపులు.

"నేను మీకు దారి చెప్పగలను కావాలంటే," అన్నాడు గొర్రెలకాపరి. అతను వారిని తప్పుదారి పట్టించ నిర్ణయించుకున్నాడు.

"అదేమీ కుదరదు. నువు మావెంట వచ్చి, మమ్మల్ని ఆ గ్రామానికి తీసుకుపోవాలి," అన్నారు కామరూపులు.

సి. వివేకానంద

"గొర్రెలు ఈనే తరుణం. నేను మందను ఒంటిగా విడిచి పోవటానికి లేదు," అన్నాడు గొర్రెలకాపరి.

"నీ కష్టసుఖాలతో మాకేం పని? నిన్ను రమ్మని ఆజ్ఞాపిస్తున్నాం," అన్నారు కామరూపులు. వారి వాలకం చూస్తే వాళ్ళు తనను వదలరని గొర్రెలకాపరికి తోచింది. ఈ సైనికులు ఆ పెళ్ళికి వెళ్ళేకన్న తాను చచ్చిపోవటానికైనా అతను సిద్ధమే. కాని తనను చంపినాక వాళ్ళు తమ దేశానికి తిరిగిపోరు. కొండల మీద వాళ్ళకు మరొక మనిషి దొరక్క పోడు. వాళ్ళు ఏదో దుష్కర్మ చెయ్యకుండా తిరిగిపోరు. అందు చేత వాళ్ళసంగతి తానే చూడాలని గొర్రెల కాపరి నిశ్చయించుకున్నాడు.

అతను కామరూప సైనికులతో, "నేనే వెంటరావాలని మీకు పట్టుదలగా ఉంటే అలాగే వస్తాను. కాని వివాహం రాత్రి ఝాముపొద్దు పోయి జరుగుతుంది. ముహూర్తానికి ముందే వెళ్ళితే మీకేమీ లాభించదు. మిమ్మల్ని చూసి భయపడి అతిథు లెవరూ రాక, పెళ్ళే ఆగిపోవచ్చు. అందు చేత చీకటి పడ్డాక బయలుదేరుదాం. అంతా రెండు మూడు ఘడియల ప్రయాణం," అని చెప్పాడు.

ఈ మాట కామరూపులకు సబబుగానే తోచింది. వాళ్ళు చీకటి పడేదాకా గొర్రెల కాపరి నివశిస్తున్న గుడిసెలోనే గడిపి, అక్కడ వంట చేసుకుని తృప్తిగా భోజనాలు కూడా చేశారు.



చీకటి పడింది. మంచు కూడా పడనారంభించింది. గొర్రెలకాపరి ఒక దివిటీ తీసుకుని ముందు బయలుదేరాడు. అతని వెనకగా కామరూప సైనికులు కబుర్లుచెప్పుకుంటూ బయలుదేరారు.

గొర్రెలకాపరికి కొండదారులన్నీ తెలుసును. అందులో కొన్ని చాలా ప్రమాదకరమైన దారులున్నాయి, కొన్ని కొండల అంచు వెంబడి పోతాయి. మరికొన్ని కొండ అంచు దాకా వచ్చి ఆగిపోతాయి. అటువంటి దారిలో నడిచేవాడు కొంచెంపక్కకు నడిచినా, అంచుదాటి అడుగువేసినా అగాథంలో పడిపోతాడు.

గొర్రెలకాపరి ఒక కొండ అంచుకు దారి తీశాడు. అతని వెనక వచ్చే కామరూప సైనికులకు దివిటీ తప్ప ఏమీ కనబడటం లేదు. గొర్రెలకాపరి కొండ అంచుదాకా జాగ్రత్తగా నడుచుకుంటూ వచ్చి, అక్కడ వున్న ఒక చెట్టుకొమ్మ పట్టుకుని, దిగువనున్న లోయుమీదికి వంగి, తన దివిటీని లోయ మీదికి చాచాడు.

అతని యుక్తి పారింది. చలి మూలంగా వేగంగా నడుస్తూవస్తున్న శత్రుసైనికులు, మంచుపడుతూ ఉండటం చేత కళ్ళు కూడా సరిగాకనబడక, ఒకరి వెనక ఒకరుగా లోయలోకి పడిపోయారు. చివరగా వచ్చిన శత్రుసైనికులు ఒకరిద్దరికి గొర్రెలకాపరి సహాయం చేసి, లోయలోకి నెట్టవలసి వచ్చింది.

శత్రు సైనికులందరూ పడిపోయాక గొర్రెలకాపరి పెళ్ళి జరిగిన ఇంటికి వెళ్ళి, జరిగినదంతా చెప్పాడు. అతని మాటలు మొదట ఎవరూ నమ్మలేదు. మర్నాడు ఉదయం కొందరు గ్రామస్థులు అతని వెంట లోయలోకి వెళ్ళి, కామరూప సైనికుల శవాలను స్వయంగా చూసిన మీదట నిజం తెలిసింది.

పెళ్ళిని భయంకర ప్రమాదం నుంచి కాపాడినందుకు పెళ్ళిపెద్దలు గొర్రెలకాపరిని బహూకరించటమే గాక, మరి కొన్ని రోజుల అనంతరం నేపాళరాజు అతన్ని పిలిపించి గొప్పగా సత్కరించాడు.





# వివేక వ్యాపారి

ఒక నగరంలో ఒక పండితుడు వివేక వ్యాపారం ప్రారంభించి, ఒక అంగడి పెట్టి, వివేకం అమ్మసాగాడు. ఒక శ్రీమంతుడి కొడుకు అంగడి మీద "ఇక్కడ వివేకం అమ్మబడును," అని రాసి ఉండటం చూసి, పండితుణ్ణి వివేకాల అమ్మకం గురించి అడిగాడు.

"ఒక రూపాయి దగ్గిర నుంచి అనేక వేల రూపాయల ఖరీదు చేసే వివేకాల దాకా అమ్మకానికి ఉన్నాయి," అన్నాడు పండితుడు.

"ఒక రూపాయి పెట్టి వివేకం కొంటే ఏమవుతుంది?" అని శ్రీమంతుడి కొడుకు అడిగాడు.

"ఎవరు చెప్పగలరు? లక్షరూపాయలు లాభం రావచ్చు," అన్నాడు పండితుడు.

ధనికుడి కొడుకు ఒక రూపాయి ఇచ్చి ఒక వివేకం కొన్నాడు. అతను కొన్న కాగితంలో, "ఇద్దరు బలవంతుల తగాదాలో చిక్కుకోరాదు," అని ఉన్నది.

ఆ కుర్రవాడు ఇంటికిపోయి తాను కొన్న వివేకం గురించి చెప్పాడు. శ్రీమంతుడు తన కొడుకును కోప్పడి, "ఆ ధూర్తుడు నిన్ను మోసం చేసి రూపాయి తీసుకుని ఈ కాగితం ముక్క ఇచ్చాడు. దీన్ని అతడి ముఖాన కొట్టి రూపాయి తిరిగి తీసుకురా," అన్నాడు.

శ్రీమంతుడి కొడుకు పండితుడి దగ్గిరికి వెళ్ళి ఆ కాగితం తిరిగి ఇస్తూ, తన రూపాయి తనకిచ్చెయ్యమన్నాడు. ఆ చీటీలో రాసి ఉన్నది తాను అమలు చెయ్యనని ఆ కుర్రవాడు ప్రమాణం చేసినాక పండితుడు కాగితం పుచ్చుకుని, రూపాయి తిరిగి ఇచ్చేశాడు.

ఒకనాడు ఆ నగరాన్ని ఏలే రాజు తన ఇద్దరు భార్యలతో నగరసంచారం చేస్తూ



ఒక నగలవర్తకుడి దుకాణంలో లక్ష రూపాయలు ఖరీదుచేసే ఒక అద్భుతమైన హారాన్ని చూశాడు. దాన్ని కొనాలని ఇద్దరు రాణులకూ గాఢమైన కోరిక కలిగింది. అంతఃపురానికి తిరిగి పోతూనే వాళ్ళు తమ తమ దాసీలకు సొమ్మిచ్చి, ఆ హారం కొనుక్కు రమ్మని పంపారు.

ఇద్దరు దాసీలూ ఒకేసారి దుకాణానికి వచ్చి నగలవర్తకుణ్ణి హారం అమ్మమని అడిగారు.

"ఉండేది ఒక హారం. ఎవరో ఒకరికే అమ్ముతాను," అన్నాడు వర్తకుడు.

"నేను ముందు అడిగాను," అంటే "నేను ముందు అడిగాను," అని ఇద్దరు దాసీలూ తగాదా పడసాగారు. ఆ సమయానికి అక్కడే ఉన్న శ్రీమంతుడి కొడుకు ఈ వాగ్వాదం చూసి ఆనందించసాగాడు.

"మీ రిద్దరూ తగాదా తీర్చుకురండి, తరవాత హారం కొందురుగాని," అన్నాడు నగలవర్తకుడు

ఇద్దరు దాసీలూ రాణుల వద్దకు తిరిగి వెళ్ళి జరిగినది చెప్పారు. ఇద్దరు రాణులూ రాజుతో ఫిర్యాదు చేశారు. ఏ రాణీకి చెందిన దాసీ ముందు హారాన్ని అడిగినదీ నిర్ణయించటానికి సాక్షు లెవరని రాజు అడిగితే, ఇద్దరూ శ్రీమంతుడి కొడుకునే సాక్షిగా చెప్పారు. రాజు శ్రీమంతుడి కొడుకుకు కబురు చేశాడు.

శ్రీమంతుడి కొడుకు భయపడ్డాడు. ఇది పెద్దవాళ్ళ మధ్య తగాదా. సాక్ష్యం ఎవరికి అనుకూలంగా చెప్పినా ప్రమాదమే. అతను తండ్రిని ఆలోచన అడిగాడు. రూపాయి పెట్టి పండితుడి దగ్గిర కొన్న వివేకాన్ని అమలు పరచనని ప్రమాణం చేసి ఉండటం అతని కిప్పుడు పెద్ద చిక్కు తెచ్చిపెట్టింది.

"ఏం చేస్తాం? ఆ వివేక వ్యాపారి దగ్గిరికిపోయి, ఈ చిక్కునుంచి బయట పడటానికి పనికి వచ్చే వివేకం కొనుక్కురా!" అన్నాడు శ్రీమంతుడు.

కొడుకు పండితుడి దగ్గిరికిపోయి జరిగినదంతా చెప్పి, తన చిక్కునుంచి బయట పడటానికి వివేకం అమ్మమన్నాడు.

"తాత్కాలికంగా బయటపడటానికి అయిదువందల రూపాయల వివేకం ఇస్తాను. కాని శాశ్వతంగా బయటపడాలంటే వివేకానికి రెండువేలూ, దానిని అమలు చెయ్యటానికి లక్ష ఖర్చవుతుంది," అన్నాడు పండితుడు.

ఆ కుర్రవాడు తండ్రిని సలహా అడిగి వచ్చి, "అయిదువందల రూపాయల వివేకం ఇవ్వండి, చాలు!" అన్నాడు.

పండితుడు అయిదువందలు పుచ్చుకుని ఇచ్చిన కాగితంలో, "పిచ్చివాడి సాక్ష్యానికి విలువలేదు," అని రాసి ఉన్నది.

రాజుగారు దాసీల విచారణ జరిపినప్పుడు, సాక్షిగా వెళ్ళిన శ్రీమంతుడి కొడుకు పిచ్చివాడిలాగా అభినయించాడు. రాజుగారు వాడి మాటలకు విలువ ఇయ్యక ఇద్దరు దాసీల ఫిర్యాదునూ కొట్టేశాడు.

హారం దుకాణంలోనే ఉండిపోయింది. దాన్ని కొనే అవకాశం ఏ రాణికీ లభించలేదు. అయితే రాణీల దాసీలు మాత్రం శ్రీమంతుడి కొడుకుమీద పగబట్టి, "పిచ్చివాడిలాగా నాటకం ఆడి, ఆ హారం ఎవరికీ దక్కకుండా చేసినందుకు నీగతి ఏం కాబోతుందో చూస్తూ ఉండు!" అని భయపెట్టారు.

ఏ ఒక రాణీకి కోపంవస్తుందో నని భయపడిన వాడికి ఇద్దరు రాణుల నుంచీ ప్రమాదం ఏర్పడింది. ఈ స్థితిలో శ్రీమంతుడూ, ఆయన కొడుకూ పండితుడి అంగడికి వెళ్ళి వివేకం చెప్పమన్నారు.

"నేను ముందే చెప్పాను. రెండువేలు ఖర్చు చేసినట్టయితే ఈ ప్రమాదం అప్పుడే తొలగిపోయేది," అని పండితుడు శ్రీమంతుడి వద్ద రెండువేల రూపాయలు పుచ్చుకుని ఒక కాగితంమీద ఏదోరాసి ఇచ్చాడు. అందులో ఇలా ఉన్నది! "ఆ హారాన్ని నువే కొని రాజుగారికి బహూకరించు."

శ్రీమంతుడు ఆ చీటీ చదువుకుని, నగల వర్తకుడి వద్దకువెళ్ళి, లక్ష రూపాయలుపోసి ఆ హారంకొని, తన కొడుకు చేత రాజుగారికి కానుకగా ఇప్పించాడు. రాజుగారు తన ఇద్దరు రాణుల అనుమతితో ఆ హారాన్ని తన కోడలికి బహూకరించాడు.






ఏతే సత్పురుషాః పరార్థఘటకాః స్వార్థాన్ పరిత్యజ్య యే,
సామాన్యా స్తు పరార్థ ముద్యమభృతః స్వార్థావిరోధేన యే,
తేమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నంతి యే,
యే తు ఘ్నంతి నిరర్థకం పరహితం తే కే న జానీమహే. 1

[తమ స్వార్థాన్ని విడిచి పరోపకారం చేసేవారు సత్పురుషులు; తమ పనులకు భంగం రాకుండా ఇతరులకు ఉపకారం చేసేవారు సామాన్యులు; తమ లాభం కోసం ఇతరులకు నష్టం కలిగించేవారు నరరూప రాక్షసులు; తమకు లాభం లేకపోయినా ఇతరులకు చెరుపు చేసేవారిని ఏమనాలో తెలియదు!]

పాపా న్నివారయతి, యోజయతే హితాయ, గుహ్యం నిగూహతి, గుణాన్ ప్రకటీకరోతి;
ఆపద్గతం చ న జహాతి, దదాతి కాలే; సన్మిత్రలక్షణ మిదం ప్రవదంతి సన్తః. 2

[కూడనిపనులు నివారించటమూ, మంచిపనులను ప్రేరేపించటమూ, రహస్యాలు దాచటమూ, మంచి గుణాలు వ్యాప్తి చెయ్యటమూ, ఆపదలోనైనా విడిచిపెట్టక పోవటమూ, సమయానికి ఆదుకోవటమూ—ఇవి మంచి మిత్రుడి లక్షణాలని పెద్దలు చెబుతారు.]

మనసి వచసి కాయే పుణ్యపీయూషపూర్ణాః త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయంతః,
పరగుణపరమాణూన్ పర్వతీకృత్య నిత్యం నిజహృది వికసంతః సంతి సన్తః కియంతః. 3

[మనోవాక్కాయాల పుణ్యం పూర్తిగా చేసుకున్నవారై, మూడు లోకాలకూ ఉపకారం చేస్తూ, ఇతరులలోని గోరంత మంచిని కొండంతగా చూసి ఆనందించే మంచివాళ్ళు చాలా కొద్దిమంది ఉంటారు.]

మంచివాళ్ళు




## 5

[ ఖడ్గ జీవదత్తులు, పశులకాపరి వృద్ధుణ్ణి కలుసుకున్నారు. ఆ సమయంలో పెద్దపులిని చూసి బెదిరిన ఎడ్లు, బండితో అరణ్యానికి అడ్డంపడి పారిపోయినై. ఖడ్గ జీవదత్తులు సూర్యోదయం వరకూ నడిచి ఒక గ్రామం చేరారు. అక్కడ వాళ్ళ కోసం గ్రామాధికారి తలార్లను పంపాడు. ఇద్దరూ గ్రామకచ్చేరీ కేసి బయలుదేరారు. తరవాత—]

ఖడ్గ జీవదత్తులు గ్రామకచ్చేరీని చేరేసరికి అక్కడ ఒక చిన్నగుంపు తయారై వున్నది. వీళ్ళను చూస్తూనే గుంపులో గుసగుసలు ప్రారంభమయినై. తలార్లు వాళ్ళను గ్రామాధికారి ముందుకు తీసుకుపోయారు. గ్రామాధికారి వాళ్ళ కేసి గుచ్చిగుచ్చి చూస్తూ, హూఁ, హాఁ అని, ఒకసారి పెద్దగా దగ్గి, గొంతు సవిరించుకుని, "మీలో ఎవరు వీరభద్రుడు? ఎవరు రామభద్రుడు?" అన్నాడు.

"ఆ పేర్లు గలవాళ్ళు మాలో ఎవరూ లేరు," అన్నాడు జీవదత్తుడు.

"అలాగా! అయితే మీ పేర్లేమిటి?" అన్నాడు గ్రామాధికారి.

జీవదత్తుడు ఆ ప్రశ్నకు జవాబు చెప్పబోయేంతలో, ఖడ్గవర్మ, "నా పేరు ఖడ్గవర్మ, యితని పేరు జీవదత్తుడు," అన్నాడు.

"పేర్లు మార్చుకోవటం ఏమంత కష్టం! ఏవీ మీ హస్తాలు? ఎడమ చేతులు



చాచండి!" అన్నాడు గ్రామాధికారి కోపంగా వాళ్ళ కేసిచూస్తూ.

ఖడ్గ, జీవదత్తులు చేతులు చాచారు. గ్రామాధికారి లేచి ముందుకు వచ్చి ఇద్దరి చేతుల్నీ పరీక్షగా చూసి, "అయిదే వేళ్ళు న్నాయి! ఏవీ కుడిచేతులు," అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు కుడిచేతులు చాచారు. గ్రామాధికారి వాటి వేళ్ళను లెక్కపెట్టి అసంతృప్తిగా తలాడించి, ఇద్దరి ముఖా ల్లోకీ ఓ క్షణకాలం చూసి, "కన్నార్పకుండా ఇద్దరూ నా కేసి చూడండి!" అన్నాడు.

ఖడ్గ జీవదత్తులకు లోపల మండిపోతున్నా, బయటపడకుండా గ్రామాధికారి ముఖం కేసి దృష్టి సారించారు. "ఏమీ మెల్ల వున్నట్టులేదే!" అన్నాడు గ్రామాధికారి పక్కన లెక్కలు చూస్తున్న గణకుడితో.

ఆ గణకుడు ఖడ్గ జీవదత్తుల కేసి పరీక్షగా చూసి తలాడిస్తూ, "రాజుగారి చాటింపూ, మెల్లకన్నూ, ఆరు వేళ్ళ మాటా అట్టా వుంచుదాం. కనబడకుండాపోయిన మీ కుమార్తె మాటేమిటి? కొలను దగ్గి ర్నుంచి ఆమెను ఏ గంధర్వులో, యక్షులో అపహరించుకుపోయారని అనుకుంటు న్నారా?" అన్నాడు.

గణకుడు యిలా అనగానే గ్రామాధి కారికి కూతురు సంగతి గుర్తుకొచ్చి, మన స్సుకు బాధ కలిగింది. అతడి ఒక్కగా నొక్క కుమార్తెను వారం రోజుల క్రిందట గ్రామానికి సమీపంగా వున్న కొలను దగ్గి ర్నుంచి ఎవరో అపహరించుకుపోయారు. ఎంత ప్రయత్నించినా యింతవరకూ ఆమె జాడ తెలియలేదు.

గణకుడు అన్న మాటల్లో సూచన ప్రాయంగా వున్న భావం గ్రహించిన గ్రామాధికారి ఖడ్గ జీవదత్తుల కేసి గుడ్లురు ముతూ, "మీరీ గ్రామం ఏం పనిమీద వచ్చారు?" అని ప్రశ్నించాడు.

"దేశాటన చేస్తూవస్తున్న మాకు, దారిలో యీ గ్రామం తగిలింది. ఇవ్వాళ యిక్కడ వుండిపోదాం అనుకున్నాం. అంతకన్న మరేం లేదు," అన్నాడు జీవదత్తుడు.

అ జవాబు వింటూనే గణకుడు వాళ్ళ ముందుకు వచ్చి, "ఈ గ్రామం చుట్టూ వున్న అడవుల్లో దొంగలూ, తోడుబోతులూ విచ్చలవిడిగా తిరుగుతున్నారు. అడిగితే దేశాటన అని సాకు చెపుతారు!" అని గ్రామాధికారితో, "ఎందుకైనా మంచిది, వీళ్ళిద్దర్నీ ఒకటి రెండు రోజులపాటు గ్రామం వదలకుండా చూడండి. ఈలోపల రాజుగారు చాటింపు వేయించిన వాళ్ళ సంగతీ, అమ్మాయిని అపహరించుకుపోయిన దుర్మార్గుల విషయం కూడా తెలిసిపోవచ్చు," అన్నాడు.

ఈ మాటలన్నీ ఖడ్గ జీవదత్తులకు వట్టి అసందర్భపు వాగుడులా తోచింది. అమ్మాయి అపహరణ ఏమిటో వాళ్ళకు అర్థమేకాలేదు. ఖడ్గవర్మ కోపంగా గ్రామాధికారి కేసీ, గణకుడి కేసీ ఓమారు చూసి, తన కత్తి పిడి మీద చేయి వేస్తూ జీవదత్తుడికి సౌంజ్ఞ చేశాడు. దాని భావం, యీ వదరుబోతుల్ని కత్తికి బలిచేసి గ్రామం నుంచి పారిపోదామని. కాని, జీవదత్తుడు చేఎత్తి అతడికి తొందరపడవద్దని సూచించాడు.

గ్రామాధికారి తలార్లను పిలిచి, వాళ్ళతో, "ఈ ఇద్దర్నీ పెద్ద నేరేడుచెట్టు దగ్గిరున్న పాకలో పెట్టి ఒకళ్ళు కాపలా వుండండి. భోజనం సంగతి పూటకూళ్ళవాడు చూస్తాడు. ఇప్పుడు తొందర పనులున్నాయి.



రేపు ఉదయం మళ్ళీ కచ్చేరీకి తీసుకు రండి," అని చెప్పాడు.

తలార్లు ఖడ్గ జీవదత్తుల్ని వెంటబెట్టుకుపోయి గ్రామం చుట్టూ వున్న ఎత్తయిన కొయ్యకంచెకు సమీపంలో వున్న ఒక ఖాళీ పాక వాళ్ళకు చూపించి, అందులో వుండమన్నారు. ఆ పాక నేరస్థుల్ని నిర్బంధించేందుకు ఉపయోగించేది. ఆ పాకకు పక్కనే ఒక నేరేడుచెట్టూ, గ్రామం నుంచి బయిటికి పోయేందుకు కంచెలో ఒకచోట వాసాలతో కట్టిన ద్వారమూ వున్నాయి.

గ్రామాధికారీ, గణకుడూ అమాయకత్వంవల్లా, మౌఢ్యంవల్లా తమకు అనవసరమైన చిక్కులు కల్పించి, చివరకు



తామెవరైనదీ బయటపడేలా చేస్తారేమో అన్న అనుమానం జీవదత్తుడికి కలిగింది. ఎవరో యిద్దరు యువకులు ఫలానా గ్రామంలో నిర్బంధంలో వున్నారనే పుకారు రాజధాని వరకూ పోయి, తమ అసలు గుట్టు బయటపడవచ్చు....

"ఖడ్గా, నువ్వు తొందర పడి ఏమీ చెయ్యకు. మనం యీ రాత్రి యిక్కణ్ణుంచి వెళ్ళిపోదాం, కాపలావాడి కనుగప్పి, కంచె మీది నుంచో, ద్వారం నుంచో అరణ్యంలోకి పారిపోవటం ఏమంత కష్టం కాదు," అన్నాడు జీవదత్తుడు.

"అమ్మాయి అపహరణ అంటా డేమిటి, ఆ కోతివెధవ!" అన్నాడు ఖడ్గవర్మ.

"అదే నా కర్థం కావటం లేదు!" అన్నాడు జీవదత్తుడు.

ఆ మధ్యాహ్నం పూటకూళ్ళ ఇంటివాడు వాళ్ళకు భోజనం తెచ్చి, వాళ్ళు ప్రశ్నించిన మీదట గ్రామాధికారి పెళ్ళీడు కూతుర్ని ఎవరో దొంగలు కొలను దగ్గిరకు నీటికై పోగా అపహరించుకు పోయారని చెప్పాడు.

"అదీ సంగతి! దానితో ఆ ముసలాళ్లిద్దరికీ మతులుపోయినై. తెలిసిందా, ఖడ్గా!" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ తల వూపి వూరుకున్నాడు. అతడికి ఆ పాకలో కూర్చోవటం ముళ్ళమీద కూర్చున్నట్టుగా వుంది. పద్మపురంలో అంత పెద్ద ప్రమాదం నుంచి బయటపడి, యిక్కడ ఒక చవట గ్రామాధికారి చేత చిక్కటం తల కొట్టివేసినట్టుగా వున్నది.

ఆ పగలు ఎలాగో గడిచింది. తలార్లలో ఒకడు పాక ముందున్న నేరేడుచెట్టుకు ఆనుకుని కూర్చుని పగలంతా కునికిపాట్లు పడుతూనే వున్నాడు. వాడి పక్కన తళతళ మెరుస్తూ ఒక ఈటె!

"ఇది శుంఠల గ్రామంలా వున్నది. ఈ నిద్రముఖం వెధవా మనకు కాపలా? ఛీ, ఛీ, బయలుదేరు, పోదాం!" అన్నాడు ఖడ్గవర్మ విసుగ్గా.

"ఖడ్గా, తొందర పడకు! నలుగురికీ తెలిసేట్టు పారిపోవటం ప్రమాదం. వాళ్ళు

మనమేదో నిజంగా దోషులం అనుకుంటారు. రాత్రికయితే, తెల్లవారి వాళ్ళకు తెలిసేలోపల మనం అరణ్యంలో కొన్ని ఆమడల దూరం పోవచ్చు," అన్నాడు జీవదత్తుడు.

సాయం సమయమై....సూర్యుడు అస్త మించాడు. క్రమంగా గ్రామాన్నీ, చుట్టూ వున్న అరణ్యాన్నీ చీకట్లు ఆక్రమించ సాగినై. పగలల్లా అరణ్య ప్రాంతాన గల పొలాల్లో పనిపాటులు చేసుకుంటూ కాలం గడిపిన గ్రామస్తులు, పశువులతో, వ్యవసాయ పరికరాలతో తిరిగి గ్రామం చేరుతున్నారు. వాళ్ళకోసం తలారి కంచె ద్వారాన్ని తెరిచాడు.

కొంచెం పొద్దు పోయింతర్వాత పూట కూళ్ళవాడు ఖడ్గ, జీవదత్తులకు భోజనం తెచ్చాడు. మాటల సందర్భంలో వాడు గ్రామంలో బయలుదేరిన పుకార్లను గురించి ఖడ్గ, జీవదత్తులకు చెప్పాడు. ఆ మధ్య ఒకళ్ళిద్దరు గ్రామస్తులు అరణ్యంలో కొందరు భైరవుడి భక్తుల్ని చూశారట. వాళ్ళల్లో వాళ్ళే ఇద్దరు వేషం మార్చుకుని గ్రామంలో భైరవుడికి బలి యిచ్చేందుకు పనికి వచ్చే కన్యల ఆచూకీ తీసేందుకు వచ్చారని వాళ్లు అనుకుంటున్నారట!

ఈ పుకార్ల సంగతి వింటూనే ఖడ్గవర్మ అసహ్యించుకుంటూ, "మేం భైరవుడి భక్తులమా? ఆ పుకారేదో నిజం చేస్తాం!



ఇక్కణ్ణించి వెళ్ళే లోపల గ్రామాధికారినీ, అతడి సహోద్యోగినీ తప్పక భైరవుడికి బలి యిస్తాం," అన్నాడు.

"బాబూ, ఆ ముసలాళ్ళను చంపటం ఎందుగ్గాని, మీరిద్దరూ సాధ్యమైనంత త్వరగా యిక్కణ్ణించి వెళ్ళిపొండి. ముఖ్యంగా ఆ గణకుడున్నాడే—వాడు బహు దుష్టుడు. రాజుగారి మెప్పు పొందేందుకు ఎలాంటి నీచకార్యం అయినా చేయగల సమర్థుడు," అన్నాడు పూటకూళ్ళవాడు.

వాడి మంచి తనానికి సంతోషించి జీవదత్తుడు వాడికి ఒక వెండినాణెం యిస్తూ, "ఇక వెళ్ళిరా. నువ్వు మాత్రం ఆ పుకార్లేవీ నమ్మకు," అన్నాడు.




పూటకూళ్ళవాడు వెళ్ళిపోయాడు. తలార్లలో రెండవవాడు రాత్రి కాపలాకు వచ్చాడు. వాడు కంచె ద్వారాన్ని మూసి లోపలి వైపున బలమైన తాళ్ళతో బంధించాడు. తరవాత పాకలోకి ఓసారి తొంగి చూసి, నేరేడుచెట్టు దగ్గిరకుపోయి, దాని మొదట్లో చాప పరుచుకుని కూర్చున్నాడు.

పొద్దు గడిచి నడిరేయి సమీపించింది. గ్రామం చుట్టూ రక్షణగా వున్న పెద్ద కంచె అవతల అరణ్యమృగాలు విచ్చలవిడిగా తిరుగుతూ రకరకాల ధ్వనులు చేస్తున్నవి. ముఖ్యంగా ఏనుగొకటి కంచె ద్వార ప్రాంతాల తిరుగుతూ మధ్య మధ్య ఘీంకారం చేస్తున్నది. అది ఘీంకరించి నప్పుడల్లా తలారి అదిరిపడుతూ, కంచెద్వారం దగ్గిరకు పోయి, లోపలి వైపున బిగించిన కట్టుతాళ్ళు సరిగా వున్నవో లేవో పరీక్షించి చూసుకుంటున్నాడు.

ఖడ్గ జీవదత్తులకు గ్రామాధికారి నిర్బంధం నుంచి బయటపడటానికి అది మంచి అదనుగా తోచింది. వాళ్ళిద్దరూ పాకనుంచి బయిటికి వచ్చి సరాసరి చెట్టు కింద కూర్చుని వున్న తలారి దగ్గిరకు పోయారు. తలారి వాళ్ళకేసి చూసి చిరునవ్వు నవ్వాడు. ఈ ఇద్దరి నుంచీ తనకేమైనా ప్రమాదం వస్తుందేమో అన్న భయం వాడిలో ఏ మాత్రం వున్నట్టు లేదు.

ఖడ్గవర్మ కత్తి దూశాడు. అది చూసి తలారి ఏమో అనబోయేంతలో జీవదత్తుడు చిన్న గొంతుతో, "నే నడిగేదానికి పెద్దగా అరవకుండా మెల్లిగా జవాబులు చెప్పు. నీకేం ప్రాణభయం వుండదు. అరిచి గోల చేశావో చావు తప్పదు," అన్నాడు.

తలారికి ఆ మాటల్తో ప్రాణభయం కలిగింది. అతడు వణికిపోతూ నంగిగా, "నన్ను చంపకండి! మిమ్మల్ని చిక్కుల్లో పెట్టిన వాడు గ్రామాధికారి. నేను ఆయన నౌకర్ని. చెయ్యమన్న పనల్లా చేయాలి," అన్నాడు.

"ఆ సంగతి మాకు తెలుసు. మాకు ఆశ్చర్యంగా వున్న సంగతేమంటే— మా ఇద్దర్నీ పారిపోకుండా కాపలా

కాసేందుకు నిన్ను ఒక్కణ్ణీ పెట్టారెందుకా అని," అన్నాడు జీవదత్తుడు.

"అదా అనుమానం! ప్రాణాలమీద ఆశ వున్న వాళ్ళెవరూ, రాత్రివేళ గ్రామకంచె దాటి పోరు. గ్రామం చుట్టూ వున్న అరణ్యంలో క్రూరమృగాలు తెల్లారేవరకూ కారాడుతూంటవి!" అన్నాడు తలారి.

"అలాగా! మాకు ప్రాణాలమీద ఆశే కాదు, సాధ్యమైతే నూరేళ్ళు బతకాలని కూడా వున్నది. మేం యీ నిర్బంధం నుంచి పారిపోదలిచాం. కంచె ద్వారాన్ని తెరు. కంచె మీదగా ఎక్కి పోవచ్చుగాని, గ్రామంలో ఎవరి కంటనైనా పడే ప్రమాదం వున్నది," అన్నాడు జీవదత్తుడు.

"కంచె అవతల సింహాలూ, పులులూ, తోడేళ్ళూ తిరుగుతూంటయి, బాబూ! ఒక ఏనుక్కూడా ఎలా ఘీంకరిస్తూ కంచె పక్కన తారట్లాడుతున్నదో వినబడటం లేదా?" అన్నాడు తలారి.

"వాటి సంగతి మేం చూసుకుంటాం. అట్టే వాగకుండా ముందు నువ్వు కంచె ద్వారం తెరువు!" అన్నాడు ఖడ్గవర్మ చాలా కోపంగా.

"అలాగే తెరుస్తాను. రాత్రివేళ అరణ్యం లోకి పోవటం ఎంత ప్రమాదమో చెప్పినా మీకు నమ్మకం కలగటం లేదు," అంటూ తలారి కంచె ద్వారం కేసి బయలుదేరాడు.




ఖడ్గవర్మా, జీవదత్తుడూ అతడి వెనకగా నడిచారు.

తలారి ద్వారం దాకా పోయి, దాన్ని కట్టివున్న తాళ్ళను విప్పబోయినవాడల్లా ఆగి, "బాబూ! ఇది నా ప్రాణం మీదికి తెస్తుంది. మీరు పారిపోయేందుకు నేను సహాయ పడ్డానని గ్రామాధికారి నన్ను కొరతవేయించుతాడు. ఒక పని చెయ్యండి. ఈ తలగుడ్డతో నా చేతులూ, కాళ్ళూకట్టి, మీ కత్తితో యీ తాళ్ళను నరికి పారిపొండి. అప్పుడు నామీద ఎవరికీ అనుమానం రాదు," అన్నాడు బతిమాలుతున్నట్టు.

తలారి మాటలు జీవదత్తుడికి నచ్చినై. అతడు చెప్పింది నిజం. నిర్దోషిని ఎందుకు

చిక్కులపాలు చేయాలి? ఖడ్గవర్మ కూడా యిందుకు సరేనన్నాడు. వెంటనే వాళ్లిద్దరూ తలారిని చెట్టు దగ్గరకు తీసుకుపోయి, వాడి తలగుడ్డ చించి కాళ్ళూ చేతులూ కట్టి, నోటి మీదుగా ఒక గుడ్డ ముక్కను పోనిచ్చి, తల వెనక దాన్ని ముడివేయబోయారు.

అప్పటివరకూ మౌనంగా వూరుకున్న తలారి, హఠాత్తుగా ఏదో ఆలోచన వచ్చిన వాడిలా, "బాబూ, ఆగండి. నా కాళ్ళూ చేతులూ కట్టి, నన్నీ చెట్టు కింద వదిలి పోయారో, మీరు తెరిచిన కంచె ద్వారం నుంచి ఏ క్రూరమృగమో లోపలికి వచ్చి నన్ను తినేస్తుంది. దయవుంచి, నన్ను, యీ చెట్టు కొమ్మల్లో పెట్టిపొండి," అన్నాడు ఏడుపు గొంతుతో.

"ఈ అనుమానం మాకు రాలేదు సుమా! అన్యాయంగా ఏ అడవిజంతువుకో ఆహారం అయిపోయి వుండేవాడివి!" అన్నాడు జీవదత్తుడు.

ఆ తరవాత గబగబా ఖడ్గ, జీవదత్తులు తలారి కాళ్ళూ చేతులూ కట్టి, అతణ్ణి అక్కడ వున్న చాపలో చుట్టి, చెట్టు కొమ్మల్లో పెట్టారు. తలారి తన నోటికి అడ్డంగా గుడ్డ బిగుసుకునే ముందు, "బాబూ, జాగర్త! ఆ ఏనుగేదో పగబట్టి నట్టు కంచె ద్వారం దాపుల్నే తిరుగు తున్నది!" అన్నాడు.

ఖడ్గవర్మ నవ్వుతూ, "కంచెనేకాక, దాని ద్వారాన్ని కూడా పసికట్టి తిరుగుతున్న దంటే, అది మామూలు ఏనుగై వుండదు— ఏనుగు రూపం దాల్చిన ఏ మాంత్రికుడో అయివుండాలి! సరే, దాని సంగతేదో మేం తేలుస్తాంలే," అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు నిశ్శబ్దంగా కంచెద్వారం కేసి నడిచారు. తలారి చెప్పినదాంట్లో అతిశ యోక్తి ఏమీలేదని యిద్దరికీ అర్థమైంది. ఏనుగొకటి కంచె అవతల చెట్ల కింద నిల బడి ఘీంకారాలు చేస్తున్నది. బహుశా, దాని పిల్లనేదో గ్రామస్తులు అరణ్యంలో పట్టుకుని గ్రామానికి తెచ్చివుంటారని ఖడ్గ జీవదత్తులు అనుకున్నారు.

—(ఇంకా వుంది)





# రహస్య వ్యక్తి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నిన్ను చూస్తే ఎవరూ నీ గొప్పతనం తెలుసుకోలేరు. కొందరు హయగ్రీవుడి లాగా తమ గొప్ప తనాన్ని రహస్యంగా దాచుకుంటారు. శ్రమ తెలియకుండా నీకు హయగ్రీవుడి వింత కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొక దేశంలో ఒక కాపుకు ముగ్గురు కొడుకు లుండేవాళ్లు. పెద్దవాళ్ళిద్దరూ చురుకైనవాళ్ళు; కష్టపడి పని చేసి ఇంత సంపాదించుకోగలవాళ్ళు. మూడోవాడు హయగ్రీవుడు మందకొడిగా ఉండేవాడు. అతను సాధారణంగా అడవిలో తిరుగుతూ ఉండేవాడు, లేదా అస్తమానమూ ఇంట్లో ఒక మూల

## బేతాళ కథలు



కూర్చునేవాడు; ఏ పనీ చేసేవాడు కాడు. చెయ్యటానికి అతనికి ఏ పనీ రాదు కూడానూ. అయినా హయగ్రీవుడు ఎంతో సౌమ్యుడూ, మంచివాడూ కావటం చేత అతన్ని తల్లి దండ్రులూ, అన్నలూ అతని మానాన బతక నిచ్చేవారు. అతను మందమతి అని వాళ్ళ నమ్మకం.

అందుచేత, రాజుగారు ఏటా తన పుట్టిన రోజు ఉత్సవం జరిపినప్పుడు, తన అన్నలతో బాటు ఉత్సవం చూడబోతానని హయగ్రీవుడు అంటే, అతని తల్లి వద్దనేది. "నువ్వు నలుగురిలో తిరగనేర్చినవాడివి కాదు. నిన్ను చూసి అందరూ నవ్వుతారు. ఇంట్లోనే ఉండిపో, నాయినా!" అనేదామె.

"ఎప్పటికైనా ఆ ఉత్సవానికి వెళితే ఎవరికీ తెలియకుండానే వెళతాలే!" అనే వాడు హయగ్రీవుడు.

ఇలా ఉండగా రాజు ఒక వింత ప్రకటన చేశాడు. ఆయన తన కుమార్తెకు వివాహం చేయ నిశ్చయించి, ఆమెకు తగిన వరుణ్ణి నిర్ణయించటానికి ఒక పోటీ ఏర్పాటు చేశాడు. రాజకుమార్తె రాజభవనం రెండో అంతస్తు మీద ఉంటే, అంత ఎత్తు ఎగిరి ఆమెను చేరుకోగల వాడికి ఆమె నిచ్చి పెళ్ళి చేస్తారు.

ఈ చాటింపు వినగానే దేశంలో ఉన్న బ్రహ్మచారియువకు లందరూ పోటీకి తల పడ్డారు. కాని ఒక్కరు కూడా రాజకుమార్తె ఉన్న రెండో అంతస్తు మీదికి ఎగరలేక పోయారు. ఒకనాడు హయగ్రీవుడి అన్నలు కూడా పోటీలో పాల్గొనటానికి బయలు దేరారు. హయగ్రీవుడు వాళ్ళ వెంట ప్రయాణం చేసే ప్రయత్నం చెయ్యక, కర్ర ఒకటి పుచ్చుకుని అడవి కేసి వెళ్ళాడు.

అడవి అంచున ఒక పెద్ద పూపొద ఉన్నది. హయగ్రీవుడు తన కర్రతో మూడు సార్లు పొదను కొట్టేసరికి ఒక దేవత ప్రత్యక్ష మయింది. ఈ దేవత అతనికి చాలా కాలంగా తెలిసినదే, కాని ఆ సంగతి ఎవ్వ రికీ తెలియదు.

"ఏం కావాలి?" అని దేవత హయగ్రీ వుణ్ణి అడిగింది.



"వేగంగా పరిగెత్తే గుర్రమూ, వెండి దుస్తులూ, వెండి నాణాలూ కావాలి," అన్నాడు హయగ్రీవుడు.

మరుక్షణమే అతను కోరినవి లభించాయి. అతను గుర్ర మెక్కి రాజభవనానికి వెళుతూ దారిలో తన అన్నలిద్దరినీ కలుసుకుని, "ఎక్కడికి ప్రయాణం?" అని అడిగాడు.

వాళ్ళు తమ తమ్ముణ్ణి గుర్తించక, "రాజభవనానికి," అన్నారు.

"శుభం," అంటూ హయగ్రీవుడు తన అన్నలకు చెరొక మూడు వెండి నాణాలూ ఇచ్చి, ముందుకు సాగాడు.

అతను రాజభవనం చేరేసరికి అక్కడ చేరినవారంతా అతని కేసి నోళ్ళు తెరుచుకుని చూశారు. అంత గొప్ప దుస్తులు ధరించిన వాణ్ణి వాళ్ళు అంతకు పూర్వం ఎన్నడూ చూడలేదు. మేడ మీది నుంచి రాజకుమార్తె కూడా అతన్ని ఎంతో ఆసక్తితో చూసింది.

అతను గుర్రం దిగి ఒక్క ఎగురు ఎగిరాడు, కాని రెండో అంతస్తును చేరుకోలేకపోయాడు. తరవాత అతను ఎవరి కేసీ చూడకుండా, తన గుర్రాన్ని ఎక్కి శరవేగంతో అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. అతను తిరిగి పూపొదకు వచ్చి, దేవత తనకిచ్చినవి ఆమెకు తిరిగి ఇచ్చేసి, ఇంటికి చేరుకున్నాడు. తరవాత చాలా సేపటికి అతని అన్నలు, "వాడెవడై ఉంటాడో!" అనుకుంటూ ఇంటికి చేరేసరికి, హయగ్రీవుడు మాటాపలుకూ లేకుండా ఒక మూల పడుకుని ఉన్నాడు.

మర్నాడు అన్నలు రాజభవనానికి బయలుదేరాక హయగ్రీవుడు అడవికి వెళ్ళి, దేవతనడిగి ఇంకా పెద్ద గుర్రమూ, బంగారు దుస్తులూ, బంగారు నాణాలూ తీసుకుని, దారిలో తన అన్నలను కలుసుకుని, వాళ్ళకు చెరొక పది బంగారు నాణాలూ ఇచ్చి, మాట్లాడకుండా ముందుకు సాగిపోయాడు.

ఈసారి అతను రెండో అంతస్తుకు ఎగిరాడుగాని అక్కడ నిలవక వెంటనే



కిందికి దూకి, తన గుర్రం ఎక్కి వెళ్ళి పోయాడు. అతను దేవత ఇచ్చినవి దేవతకు తిరిగి ఇచ్చి, ఇల్లు చేరుకుని ఒక మూల పడుకున్నాడు.

అతని అన్నలు చాలా సేపటికి ఇంటికి తిరిగి వచ్చి, తమ తల్లితో తాము చూసినదంతా ఉత్సాహంగా చెప్పారు.

ఈలోపల రాజు, పందెంలో గెలిచినవాడు పరారీ అయినందుకు చాలా ఆగ్రహం చెంది, అతన్ని పట్టుకున్నవాడికి అంతులేని ధనం ఇస్తానని చాటింపు వేయించాడు.

"అతను మాకు చాలా ఉపకారమే చేశాడు. అయినా రేపు అతను కలిసినప్పుడతన్ని పట్టుకుని రాజుగారికి అప్పగించి, బహుమానం పుచ్చుకుంటాం," అన్నారు హయగ్రీవుడి అన్నలు తమ తల్లితో.

"వాడు అంత సులువుగా దొరకడేమో?" అన్నాడు హయగ్రీవుడు.

"నీ కసలేమీ తెలీదు. నువు నోరు మూసుకో," అని అన్నలు అతన్ని మందలించారు.

మర్నాడు చాలా పెందలాడే అన్నలు రాజభవనానికి బయలుదేరారు. ఆ రోజు హయగ్రీవుడు కూడా పెందలాడే లేవటం చూసి తల్లి ఆశ్చర్యపడింది.

"ఏమీ లేదమ్మా, అడవికి పోయి కట్టెలు తెద్దామనుకుంటున్నాను," అన్నాడు హయగ్రీవుడు. అతను అడవికి వెళ్ళిన మాట నిజమేగాని, కట్టెల కోసం కాదు. ఈసారి అతను దేవత నడిగి రత్నాలంకారాలు గల గుర్రాన్నీ, దుస్తులనూ, ఒక రత్నాల సంచినీ పుచ్చుకున్నాడు.

అతను తన అన్నలను కలుసుకోగానే వాళ్ళు, "దొరికావురా, దొంగ! రాజుగారి దగ్గిరికి పద!" అంటూ అతన్ని గుర్రం మీది నుంచి కిందికి లాగబోయారు. హయగ్రీవుడు ఇద్దరినీ చెరొగ కాలితోనూ గట్టిగా తన్ని పడేసి, "మీరు వట్టి మూఢులు! అయితే నాకు మాత్రం మూఢులంటే మీలాగా కోపం లేదు, జాలి!" అని, రెండు గుప్పెళ్ళు రత్నాలు వారిమీద విసరికొట్టి, "ఇదుగో, మీ

బహుమానం," అని అమిత వేగంగా ముందుకుసాగాడు.

అతను రాజధాని చేరగానే అక్కడి రాజ భటులూ, సైనికులూ అతన్ని చుట్టుముట్టి పట్టుకోబోయారు. కాని అతను లాఘవంగా వారికి అందకుండా తప్పించుకుని, రాజ కుమార్తె ఉన్న భవనం వద్దకు వచ్చి, ఒక్క గంతుతో రెండో అంతస్తు చేరాడు.

రాజకుమార్తె అతన్ని చూసి, "నీ కిష్టం లేకపోతే నన్ను పెళ్ళాడమని నిర్బంధించను. కాని నా జ్ఞాపకార్థం ఈ ఉంగరం ఉంచుకో," అంటూ అతని చేతివేలికి తన ఉంగరం తొడిగింది.

అతను కిందికి దూకినప్పుడు పట్టుకుందామని రాజభటులు కింద నిలబడ్డారు. కాని అతను వారిని దాటి తన గుర్రం మీదికి సూటిగా దూకి, అతి వేగంగా వెళ్ళిపోయాడు. కొద్ది నిమిషాలకల్లా అతను పూపొద చేరుకుని, దేవతకు ఆమె ఇచ్చినవి తిరిగి ఇచ్చి, ఇంటికి వెళ్ళి ఒక మూల పడుకున్నాడు.

అన్నలు ఇంటికి తిరిగి వస్తూ, "మన మొద్దు వెధవ అన్నంతా అయింది. మేమూ రాజకుమారుణ్ణి పట్టలేకపోయాం. అయినా అతను మాకేమిచ్చాడో చూడు!" అంటూ రత్నాలు తీసి తల్లికి చూపించారు. వాటితో తమ జీవితాలు సుఖంగా వెళ్ళిపోతాయని తల్లి సంతోషించింది.

రాజకుమార్తెను గెలుచుకున్నవాడు కన పడకుండా పోవటం చూసి రాజు చాలా కల వరపడ్డాడు. ఆయన తన రాజ్యంలో ఉన్న





కులీనుల నందరినీ విందుకు ఆహ్వానించాడు. కాని వచ్చిన వారిలో రాజకుమార్తె తన వరుణ్ణి గుర్తించ లేదు. ఒక వేళ ఆ వరుడు కులీనుడు కాడేమోనని, రాజు సామాన్య జనులకూ, బీదసాదలకూ కూడా విందులు ఏర్పాటు చేశాడు. అందు వల్ల కూడా ఫలితం లేకపోయింది.

తరవాత రాజు తన కుమార్తె ఉంగరం ఎవరి చేతిన ఉన్నదో గాలించి చూడమని భటులను పంపాడు. వాళ్ళు హయగ్రీవుడి ఇంటికి వచ్చి, అతని వేలిన ఉంగరం చూసి, రాజుగారి వద్దకు పట్టుకు పోయారు.

ఈ చింకిబట్టలు ధరించిన కాపు కొడుకే అంత శక్తి సామర్థ్యాలు చూపాడంటే రాజుకు నమ్మశక్యం కాలేదు. కాని వరుడు అతనే గనక, అతనికి మంచి బట్టలు కట్టబెట్టి, రాజకుమార్తె నిచ్చి పెళ్ళి చేశారు.

ఈ వివాహం జరిగిన కొద్ది రోజులకే రాజుకు యుద్ధం సంప్రాప్త మయింది. రాజు తన ఇద్దరు కొడుకులనూ, అల్లుడైన హయగ్రీవుణ్ణీ యుద్ధానికి బయలుదేరమన్నాడు. హయగ్రీవుడు అందరికన్న ముందు బయలుదేరి, ఒక కొలను ఒడ్డున ఆగి, అక్కడ కప్పలతో ఆడుకోసాగాడు.

మరికొంతసేపటికి రాజకుమారులు సైన్యాలతో సహా అటుగా వచ్చి, తమ బావమరిది చిన్న పిల్లవాడిలాగా ఆడుకుంటూ ఉండటం చూసి చీదరించుకుని, యుద్ధరంగానికి సాగిపోయారు. సైన్యం కనుమాటు కాగానే హయగ్రీవుడు తన గుర్రంమీద పూపాదను చేరుకుని, ఒక ఉత్తమాశ్వాన్నీ, ఎంత పెద్ద సేననైనా జయించ దగిన ఖడ్గాన్నీ దేవత నుంచి పుచ్చుకుని, వాయువేగంతో వెళ్ళి తన బావమరుదులను కలుసుకున్నాడు.

వాళ్ళు అతన్ని గుర్తించ లేదు. అతను వాళ్ళను, "మీ రెక్కడికి పోతున్నారు?" అని అడిగాడు.

"యుద్ధానికి," అన్నారు వాళ్ళు.

"నేనూ అక్కడికే. పోదాం పదండి!" అంటూ హయగ్రీవుడు వాళ్ళవెంట యుద్ధరంగానికి వెళ్ళాడు. యుద్ధభూమి చేరు

తూనే అతను శత్రుసైన్యంలో జొరపడి, ఎడాపెడా శత్రువులను వధించసాగాడు. సాయంకాలం దాకా యుద్ధం జరిగింది. జయాపజయాలు తేలలేదు.

రాజకుమారులు ఇంటికి వచ్చి, ఆ వీరుణ్ణి గురించీ, కప్పలతో ఆడుకుంటూన్న తమ బావమరిదిని గురించీ చెప్పారు.

ఇంతలో హయగ్రీవుడు వచ్చాడు. రాజు అతన్ని చూసి పట్టరాని ఆగ్రహంతో, "నువు నాకు తీరని అపకీర్తి తెచ్చావు. నా కుమార్తె పిరికివాణ్ణి పెళ్ళాడింది!" అన్నాడు.

మర్నాడు యుద్ధభూమికి రాజు స్వయంగానే సైన్యాలను నడిపించుకు వెళ్ళాడు. ఆయన తన వెంట హయగ్రీవుణ్ణి కూడా రమ్మన్నాడు. కాని హయగ్రీవుడు మధ్య దారిలో గుర్రాన్ని వెనక్కు తిప్పి అతి వేగంగా వెళ్ళిపోయాడు.

"పిరికిపంద! వీణ్ణి రాజభవనంలో మరి అడుగు పెట్టనివ్వను," అనుకున్నాడు రాజు.

రాజుగారు యుద్ధ రంగాన్ని చేరే లోపల యుద్ధం ముగిసిపోయింది. శత్రుసైన్యాలు చిందరవందర అయి ఉన్నాయి. శత్రురాజు బందీ అయి ఉన్నాడు.

"ఏం జరిగింది?" అని రాజు శత్రు రాజును అడిగాడు.

"మీ యోధుడు ఒక్కడే నా సేననంతటినీ నాశనం చేశాడు. అత నెవడోగాని



వెయ్యిమంది రాక్షసుల పెట్టుగా ఉన్నాడు," అన్నాడు శత్రురాజు.

"అత నెక్కడ?" అని రాజు అడిగాడు.

"గాయపడి ఆ చెట్టు కింద ఉన్నాడు," అన్నాడు శత్రురాజు.

రాజు ఆ యోధుడి వద్దకు వెళ్ళి చూశాడు. శిరస్త్రాణం ధరించి ఉండటంచేత యోధుడి ముఖం రాజుకు కనిపించలేదు. ఆ యోధుడి తొడమీద పెద్ద గాయమై రక్తం కారుతున్నది.

రాజు తన జరీ బట్ట చించి ఆ యోధుడికి కట్టు కట్టించి, "నువు ఎవరు, నాయనా?" అని అడిగాడు.

"నేను నేనే!" అన్నాడు హయగ్రీవుడు. అతను లేచి తన గుర్రం ఎక్కి బయలుదేరి,

కొంతసేపటికి తన మామూలు దుస్తులతో రాజభవనం చేరి, గాయం బాధ పెడుతూండటంవల్ల తన గదిలో పడుకున్నాడు.

రాజు ఇంటికి రాగానే ఆయన కొడుకులు, "హయగ్రీవుడి గాయానికి నీ బట్టతో కట్టు కట్టావా ఏమిటి?" అని అడిగారు.

రాజు ఈ మాటకు ఆశ్చర్యపోయి తన అల్లుడున్న చోటికి వెళ్ళి, అతని గాయానికున్న కట్టు చూసి, "ఆ యోధుడివి నువా, నాయనా? ఆ సంగతి అప్పుడే చెప్పావు కావేం?" అన్నాడు.

"నేను నేనేనని చెప్పాను కద!" అన్నాడు హయగ్రీవుడు.

ఆ తరవాత రాజు తనకు గొప్ప అల్లుడు దొరికినందుకు ఎంతో గర్వపడ్డాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, హయగ్రీవుడు తన గొప్ప తనాన్ని దాచి ఉంచటానికి కారణమేమిటి? అణకువ చేతనా? రాజుకు అకస్మాత్తుగా కనువిప్పు కలిగించి ఆశ్చర్య సంభ్రమాలు కలిగించాలనా? ఈ అనుమానానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "హయగ్రీవుడు గొప్ప వివేకం గలవాడు. దుస్తులను బట్టీ, బాహ్యశక్తులను బట్టీ మనిషి వాస్తవతత్వం మారదు. అతను మంచి దుస్తులు వేసుకున్నప్పుడు రాజకుమారుడని అందరూ అనుకున్నారు. రాజు అతన్ని ఒకసారి పిరికివాడనీ, మరొకసారి మహా యోధుడనీ అనుకున్నాడు. ఇది భ్రమ. అతను రాజకుమార్తెను దేవత సహాయంతోనే గెలిచాడు. అందుకే అతను ఆమెను పెళ్ళాడే ప్రయత్నం చెయ్యలేదు. దేవత సహాయంతోనే అతను శత్రువులను ఒంటరిగా జయించాడు. అదీ అతని ప్రతాపం కాదు. కీర్తి ప్రతిష్ఠలు సంపాదించుకునే పనులు చేసి కూడా, 'నేను నేనే' అన్న సంగతి మరిచిపోని హయగ్రీవుడు మహాజ్ఞాని అనవచ్చు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# తెలివికి మందు

ఒక గ్రామంలో ఒక తెలివితక్కువ వాడుండే వాడు. వాడి తెలివితక్కువ చూసి అందరూ నవ్వేవాళ్ళు. అందరి చేతా "దద్దమ్మ" అని పిలిపించుకోవటం వాడికి బాధగా ఉండేది. "కొండ మీది ఎరుకలసాని దగ్గిర తెలివికి మందు తెచ్చుకో రా, దద్దమ్మా," అని కొందరు వాణ్ణి హేళన చేశారు.

కొండ మీది ఎరుకలసాని రకరకాల మందు లిస్తుందనీ, మంత్రాలు వేస్తుందనీ వాడికి తెలుసు. అందుచేత వాడు వాళ్ళ అమ్మను, "అమ్మా, కొండ మీది ఎరుకల సాని దగ్గిరికి పోయి తెలివికి మందు తెచ్చు కోనా?" అని అడిగాడు.

"అలాగే తెచ్చుకోరా, బాబూ. అయితే ఆ ఎరుకలసాని చాలా గడుసు మనిషిట. ఆ మనిషితో పిచ్చిపిచ్చిగా మాట్లాడక, మర్యాదగా మాట్లాడి పని పూర్తి చేసుకురా," అన్నది వాడి తల్లి.

వాడు కొండ ఎక్కి ఎరుకలసాని దగ్గిరికి వెళ్ళాడు. ఆమె కుండ కింద మంట వేసి, కుండను కలియబెడుతున్నది.

"అంతా కులాసాయేనా, ఎరుకల సానీ?" అన్నాడు "దద్దమ్మ."

"కులాసాయే," అన్నది ఎరుకలసాని.

"దద్దమ్మ" ఆకాశం కేసి చూసి, "వాన రావచ్చు," అన్నాడు.

"రావచ్చు," అన్నది ఎరుకలసాని.

"రాకనూ పోవచ్చు," అన్నాడు "దద్దమ్మ."

"అదీ నిజమే," అన్నది ఎరుకలసాని.

తరవాత ఇంకే మనాలో "దద్దమ్మ"కు తట్టలేదు. "కుశల ప్రశ్నలు అపోయాయి గనక, తెలివికి మందేమన్నా ఉంటే ఇస్తావా?" అన్నాడు వాడు.

"ఏ రకమైన తెలివి? రాజుల తెలివీ, సైనికుల తెలివీ, పండితుల తెలివీ—ఇలాంటి

బి. సూర్యనారాయణ




తెలివికి నా దగ్గర మందు లేదు," అన్నది ఎరుకలసాని.

"మామూలుగా అందరికీ పనికివచ్చే తెలివికి మందిస్తే చాలు," అన్నాడు వాడు.

"అలాగయితే నేను సహాయపడగల నేమో. కాని, ముందు నువు ఒక పని చేయాలి," అన్నది ఎరుకులసాని.

"ఏమిటది?" అని వాడు అడిగాడు.

"ప్రపంచంలో నీకు అన్నిటికన్నా ఇష్ట మైనది తీసుకురా. నేను నీకు తెలివి మందు దొరికే మార్గం చెబుతాను," అన్నది ఎరుకులసాని.

"అది నాకెలా తెలుస్తుంది?" అన్నాడు వాడు తెల్లబోతూ.

"నాకు మాత్రం ఎలా తెలుస్తుంది? నువు నీకు ఎక్కువ ఇష్టమైనది తెచ్చినాక నేను నిన్నొక ప్రశ్న వేస్తాను. దానికి నువు సమాధానం చెప్పు. నీ సమాధానాన్ని బట్టి నువు నీ కిష్టమైనది తెచ్చావో, లేదో నేను తెలుసుకుంటాను," అన్నది ఎరుకలసాని.

"దద్దమ్మ" ఇంటికి పోయి తన తల్లితో జరిగిన దంతా చెప్పాడు.

"ఆ ఎరుకలసాని చెప్పినట్టే చెయ్యి, నాయినా. నువు కూడా అందరి లాగే ఉండవచ్చు," అన్నది తల్లి.

"నా కన్నిటికన్న కోడికూర ఇష్టం. అందుకని ఎరుకులసాని దగ్గిరికి కోడిని తీసుకుపోతాను," అనుకున్నాడు వాడు.

వాడు మర్నాడు ఎరుకలసానిని చూడ బోయి, "నాకు అన్నిటికన్నా ఇష్టమైనది తెచ్చాను," అన్నాడు, కోడిని చూపి.

"ఇంతకన్న ఇష్టమైన దేదీ లేదా నీకు? అలా అయితే ఈ ప్రశ్నకు సమాధానం చెప్పు: కాళ్ళు లేకుండా పరిగెత్తే దేది?" అన్నది ఎరుకలసాని.

"దద్దమ్మ" బుర్ర గోక్కున్నాడు. ఎంత ఆలోచించినా వాడికి సమాధానం తట్టలేదు.

"సమాధానం చెప్పలేకపోయావు. నువు తెచ్చినది సరిఅయిన వస్తువు కాదు. ఇవాళ నీకు తెలివిమందు లేదు. వెళ్ళిపో," అన్నది ఎరుకలసాని.

"దద్దమ్మ" నిస్పృహతో ఇంటికి తిరిగి వచ్చాడు. తల్లిని చూడగానే వాడు నెత్తి బాదుకుని, "తప్పు చేశానమ్మా. నాకు ప్రపంచంలో నీ కన్న ఇష్టమైన దేదీ లేదు. నిన్ను తీసుకుపోవలసింది. రేపు ఎరుకల సాని దగ్గిరికి నాతో నువు రా," అన్నాడు.

మర్నాడు తల్లికొడుకు లిద్దరూ ఎరుకల సాని వద్దకు వెళ్ళారు.

"ఎరుకలసానీ, ఇవాళ నేను నిజంగా నా కిష్టమైనది తెచ్చాను. ఇదిగో మా అమ్మ!" అన్నాడు వాడు.

"అదేదో ఇప్పుడే చూస్తాను. ఈ ప్రశ్నకు బదులు చెప్పు: బంగారం కాకపోయినా పచ్చగా ఉండి ప్రకాశించే దేది?" అన్నది ఎరుకలసాని.

"దద్దమ్మ" మళ్ళీ బుర్ర గోక్కుంటూ ఎంతో ఆలోచించాడు; కాని ఆ ప్రశ్నకు జవాబు తట్టలేదు.

"చూశావా? నువు ఈసారి కూడా నీ కెక్కువ ఇష్టమైనది తీసుకురాలేదు. నువు చూడబోతే నే ననుకున్న దాని కన్న కూడా తెలివితక్కువ వాడివిగా కనబడుతున్నావు. నీకు తెలివిమందు నిజంగా అవసరమే," అన్నది ఎరుకలసాని.

"అదే మరి!" అంటూ వాడు తన తల్లిని వెంట బెట్టుకుని కొండ దిగి రాసాగాడు.

తల్లి కొడుకులు కొండ దిగి వస్తూండగా వాళ్ళకు దారిలో ఒక పిల్ల ఎదురయింది.

"ఏం, దద్దమ్మా? ఎందుకు మొహం వేళ్ళాడ వేసుకుని ఉన్నావు?" అని అడిగిం



దాపిల్ల. "దద్దమ్మ" ఆ పిల్లకు జరిగినదంతా చెప్పాడు.

"ఎంత అన్యాయం! నీకు సహాయం చేసే వాళ్ళెవరూ లేరా?" అని ఆ పిల్ల అడిగింది.

"ఎవరూ లేరు," అంటూ వాడు మూలిగాడు.

"అయితే, నేను సహాయం చేస్తాను. నిన్ను పెళ్ళి చేసుకుని, కని పెట్టి ఉంటాను," అన్నదామె.

"అలా అయితే పెళ్లి చేసుకుందాం పట్టు," అన్నాడు 'దద్దమ్మ'.

ఇద్దరూ పెళ్ళి చేసుకున్నారు. 'దద్దమ్మ' పెళ్ళాం ఇల్లు చక్కబెట్టి, వంట చేసి, సంసారం సాగించింది.

"దద్దమ్మ" పరమానందభరితుడై ఒక నాడు, "పెళ్ళామా, ఈ లోకంలో నా కందరి కంటె కూడా నువ్వంటేనే ఇష్టం. కొండ మీది ఎరుకలసాని దగ్గిరికి పోదాం పద. తెలివికి మందిస్తుందేమో!" అన్నాడు తన భార్యతో. ఇద్దరూ కొండ మీదికి వెళ్ళారు.

"ఏం, ఎరుకలసానీ? ప్రపంచంలో కెల్లా నా కెక్కువ ఇష్టమైన మనిషిని తెచ్చాను," అన్నాడు "దద్దమ్మ."

"సరే, కాళ్ళు లేకుండా పరిగెత్తే దేమిటి?" అని ఎరుకలసాని అడిగింది.

భార్య తన చెవిలో రహస్యంగా చెప్పిన మీదట, "నీరు!" అన్నాడు "దద్దమ్మ."

"బంగారం కాకపోయినా పచ్చగా ఉండి ప్రకాశించే దేమిటి?" అని ఎరుకలసాని మళ్ళీ అడిగింది.

భార్య రహస్యంగా చెప్పినాక, "సూర్యుడు!" అన్నాడు "దద్దమ్మ."

"ఇక నేం? తెలివికి మందు సంపాదించేశావు!" అన్నది ఎరుకలసాని.

"ఏదీ? ఎక్కడున్నది?" అని ఆత్రంగా అడిగాడు "దద్దమ్మ."

"నీ భార్య తలకాయలో! మందమతికి మందేమిటంటే తెలివైన భార్యే. నీకు అదే దొరికింది. ఇక పద!" అన్నది ఎరుకలసాని.

భార్యాభర్తలిద్దరూ కొండ దిగి ఇంటికి వెళ్ళిపోయారు.






తరవాత అయన ఇంటి యజమాని చూపిన కొండ మీదికి వెళ్ళాడు. అక్కడ పాడుబడిన గుడి ఒకటి ఉన్నది. గుడికి సమీపంలో ఒక బ్రహ్మాండమైన దేవదారు చెట్టున్నది. అందులో ఒక పెద్ద తొర్ర ఉన్నది. గురువు ఆ రాత్రి ఆ చెట్టు తొర్రలో దాగి కూర్చున్నాడు.

అర్ధ రాత్రి వేళకు ఒక గుంపు గుడి ముందుకు వచ్చింది. ఆ గుంపుకు నాయకుడి లాగా కనిపిస్తున్న వాడొకడు తల ఎత్తి అటూ ఇటూ చూసి, "షిప్పెయ్ తరో రాలేదు గద?" అన్నాడు.

"ఇవాళ షిప్పెయ్ తరో వచ్చే రోజు కాదు," అన్నాడు మరొకడు.

తరవాత గుడి తలుపులు తెరుచుకుని గుంపంతా గుడి లోపలికి వెళ్ళింది. వాళ్ళు గుడిలోపల, "నగహమ నివాసి షిప్పెయ్ తరో—షిప్పెయ్ తరోకి చెప్పెయ్యకండి," అంటూ పాట పాడటం గురువుకు స్పష్టంగా వినిపించింది. అదే పాట వాళ్ళు మళ్ళీ మళ్ళీ పాడటం విని గురువుకు ఒకటి స్పష్టమయింది. వాళ్ళు ఏ జాతి పిశాచాలైనప్పటికీ, వాళ్ళకు షిప్పెయ్ తరో అనే వాడంటే చెడ్డ భయం! ఆ పేరుగల వాడి చేతిలో వాళ్ళు ఓడిపోవచ్చు.

గురువు ఆ రాత్రి పిల్ల ఇంటికి తిరిగి వచ్చి, షిప్పెయ్ తరో అనే పేరుగలవాణ్ణి వెతకటానికి నగహమ అనే గ్రామానికి బయలుదేరి వెళ్ళాడు. అది మరొక ప్రాంతంలో ఉన్న ఒక బస్తీ. అక్కడ అయన ప్రతి ఇంటా, "షిప్పెయ్ తరో అనే వాడు మీకు తెలుసునా?" అని అడిగాడు. ఒక్కరు కూడా ఆ పేరు గలవాడి జాడ చెప్పలేకపోయారు. అయన నిస్పృహ చెంది ఒక వీధి పక్కన రాతి మీద కూర్చుని ఉండగా అయన దిక్కుగా ఒక పెద్ద కుక్క, దూడ ప్రమాణంలో ఉన్నది, వచ్చింది. దాని వెనకగా దాని యజమాని, "షిప్పెయ్ తరో," అని దాన్ని పిలుస్తూ వచ్చాడు.

గురువుకు ఎక్కడలేని ఉత్సాహమూ తిరిగి వచ్చింది. అయన కుక్క యజమా

నికి నరబలి వృత్తాంతం చెప్పి, "ఒక బాలిక ప్రాణాలు కాపాడటానికి మీ కుక్కను అరువిస్తారా?" అని అడిగాడు. కుక్క యజమాని అందుకు సంతోషంగా సమ్మతించాడు. ఆ కుక్కను వెంట బెట్టుకుని గురువు సాధ్యమైనంత శీఘ్రంగా కొండల ప్రాంతానికి బయలుదేరాడు.

ఇక్కడ కొండ గ్రామంలో బలి ఇచ్చే రోజు వచ్చింది. గురువు జాడ లేదు. బాలిక తల్లిదండ్రులు ఆమెను బలికి సిద్ధం చెయ్యక తప్పలేదు. ఆమెను ఉంచటానికి ఒక పొడుగుపాటి పెట్టె తెచ్చారు; ఆమెకు మృతి చిహ్నంగా తెల్ల బట్టలు కట్టి, పెట్టెలో పడుకో బెట్టారు.

మోసేవాళ్ళు కొండ మీదికి తీసుకుపోవటానికి పెట్టెను ఎత్తబోయే సమయంలో గురువు రొప్పుతూ, పరిగెత్తుకుని కుక్కతో సహా వాళ్ళ దగ్గరకు వచ్చాడు.

శోకంతో మతిచెదిరి ఉన్న బాలికను పెట్టెలో నుంచి పైకి తీసి, ఆమెకు మారుగా గురువునూ, కుక్కనూ అందులో ఉంచి, కొండ మీదికి చేర్చి, గుడి ముందు దించి, వెనక్కు తిరిగి చూడకుండా కొండ దిగి పోయారు మోసేవాళ్ళు.

అర్ధ రాత్రి సమయానికి పిశాచాల గుంపు వచ్చింది. అందరూ, "షిప్పెయ్ తరోకి చెప్పెయ్యకండి," అంటూ పెట్టె చుట్టూ చేరి పాడారు.

కొందరు పిశాచాలు పెట్టెలో ఏముందో చూద్దామని, మూత ఎత్తారు.

మరుక్షణం కుక్క భీకరంగా మొరిగి బయటికి దూకి, పిశాచాల మీద పడింది. గురువు కూడా బయటికి దూకి, అందిన పిశాచాన్నల్లా కత్తితో నరికాడు.

మర్నాడు తెల్లవారింది. "ఈపాటికి దేవత గురువును భక్షించి ఉంటుంది," అని గ్రామస్థులు అనుకున్నారు. వాళ్ళు కొండ ఎక్కి వచ్చి చూసేసరికి, గుడి చుట్టూ మర్కటాల లాటి ప్రాణుల శవాలు చిందర వందరగా పడి ఉన్నాయి.

అటు తరవాత ఆ గ్రామస్థులు నరబలులు మానేశారు.





# చిరాయువు

ఒక చిన్న రాజుకు ముగ్గురు కొడుకులుండే వారు. వారిలో మూడోవాడు కుశలుడు. అతను ఒకనాడు తన తండ్రితో, "నాకు ఈ దేశంలో ఉండాలని లేదు. నాకు కొంత డబ్బూ, ఒక గుర్రమూ ఇచ్చినట్టయితే దేశసంచారం చేసి, ఎక్కడో ఒకచోట నాకు కావలసిన స్త్రీని వివాహం చేసుకుంటాను," అన్నాడు.

రాజు ఇందుకు అభ్యంతరం చెప్పలేదు. కుశలుడు కొంత ధనం తీసుకుని, గుర్రం ఎక్కి నగరం నుంచి బయలుదేరాడు. నగర ప్రాకారం దాటగానే వనం ఉన్నది. ఆ వనంలో ఒకచోట గుర్తుగా తన డబ్బులో హెచ్చు భాగం పూడ్చిపెట్టి కుశలుడు ముందుకు సాగిపోయాడు.

అతను ఎన్నో పట్టణాలు చూశాడు, ఎన్నో దేశాలు దాటాడు, కాని అతనికి నచ్చిన కన్య ఎక్కడా కనిపించ లేదు. ఇలా ఎనిమి దేళ్ళపాటు ప్రయాణం చేసి అతను పక్షుల రాజ్యం చేరాడు.

పక్షులరాణి యౌవనంలో ఉండి చాలా అందంగా ఉన్నది. ఆమె అతన్ని చూసి, "ఏం పనిమీద పోతున్నావు?" అని అడిగింది.

"వార్ధక్యం లేని దేశంలో వధువును సంపాదించు కుందామని తిరుగుతున్నాను," అన్నాడు కుశలుడు.

పక్షులరాణి నవ్వి, "ఈ దేశంలో ముసలి తనం లేదు," అన్నది.

"ఎలా చెప్పగలవు?" అన్నాడు కుశలుడు.

"ఈ మహారణ్యం చూశావా? ఇదంతా కొట్టేసినప్పుడు గాని ఈ దేశంలోకి ముసలి తనం అడుగుపెట్టదు," అన్నది పక్షులరాణి.

"అలా అయితే నేనిక్కడ ఉండలేను. ఎప్పటికైనా ఈ చెట్లన్నీ కొట్టివెయ్యటం

ఎస్. బాలసుందరశర్మ

జరిగి తీరుతుంది. అప్పుడు వార్ధక్యం ఈ దేశంలోకి అడుగు పెడుతుంది,'' చెప్పి కుశలుడు పక్షులరాణి వద్ద ు పుచ్చుకుని ముందుకు సాగిపోయాడ

అతను మరో ఎనిమిది సంవ ు సంచారం చేసి ఒక కంచుకోటన ు కున్నాడు. ఆ కోటలో నుంచి ఒక అంద మైన యువతి వచ్చి కుశలుణ్ణి చూసి, "స్వా తం! నేను నీ కోసం ఎన్నో ఏళ్ళుగా ఎదురు చూస్తున్నాను,'' అన్నది.

ఆమె అతని గుర్రాన్ని తీసుకుపోయి కొట్టంలో కట్టేసి, దానికి ఉలవలు పెట్టింది. కుశలుడు ఆ రాత్రి ఆమెకు అతిథిగా ఉండి, తెల్లవారు జామునే లేచి, తన గుర్రానికి జీను తగిలించి, ప్రయాణమయ్యాడు.

ఆమె అతని ప్రయాణ సన్నాహం చూసి, "ఇంత పెందరాళే గుర్రానికి జీను వేస్తున్నావేమిటి? ఎక్కడికి వెళ్ళిపోతున్నావు?'' అని అడిగింది.

"ముసలితనం లేనిచోటికి,'' అన్నాడు కుశలుడు.

"అలా అయితే నువు ఇక్కడే ఉండిపోవచ్చు. ఇక్కడ ముసలితనం లేదు,'' అన్నదామె.

"ఎలా చెప్పగలవు?'' అని కుశలుడు ఆమెను అడిగాడు.

"ఆ కొండలు చూశావా? అవి అరిగిపోయి, దుమ్మూ ధూళిగా మారి నేలమట్టం అయేదేకా ఇక్కడ ముసలితనం అడుగు పెట్టదు,'' అన్నదామె.



"ఎప్పుడో ఒక నాటికి ఆ కొండలు అరిగి నేలమట్టంకాక పోవు. అప్పుడు ముసలితనం వచ్చి తీరుతుంది," అని కుశలుడు ముందుకు సాగిపోయాడు.

వెళ్ళగా వెళ్ళగా అతనికి ఒక గుడిసె తగిలింది. కుశలుడు గుర్రం దిగి గుడిసెలో ప్రవేశించాడు. లోపల ఒక కుర్రవాడు కని పించి, "ఏం కావాలి?" అని అడిగాడు.

"ముసలితనం లేని చోటుకోసం వెతుకు తున్నాను," అన్నాడు కుశలుడు.

"ఇదే ఆ చోటు. నీకు కావలిసిన చోటికే వచ్చావు. ఇక్కడ వార్ధక్యం అడుగు పెట్ట లేదు," అన్నాడు ఆ కుర్రవాడు.

"అయితే నువ్వెవరు?" అని కుశలుడు అడిగాడు.

"నేను గాలిని. నువు మనుష్యప్రపంచం దాటి చాలా దూరం వచ్చేశావు." అన్నాడు కుర్రవాడు.

"నువు ఒప్పుకుంటే శాశ్వతంగా ఇక్కడే ఉండి పోతాను," అన్నాడు కుశలుడు.

కుశలుడు అదే గుడిసెలో చాలా ఏళ్ళు జీవించాడు. అతని వయసు ఏ మాత్రమూ పెరగలేదు. అతను గుడిసె దాటి వెళ్ళ లేదు. కాని గాలిమాత్రం రోజూ వెళ్ళి, ఎక్కడెక్కడో తిరిగి వస్తూండేవాడు.

అస్తమానమూ గుడిసెలో ఉండటం కుశలుడికి విసుగుపుట్టింది. అతనిలో ఏదో ఆరాటం ఉన్నట్టు గమనించి గాలి కుశలు డితో, "కావాలంటే ఎక్కడైనా తిరిగిరా. కాని ఈ సమీపంలో ఉన్న పశ్చాత్తాపలోయలోకి





మాత్రం దిగకు. అది చూడటానికి ఎంతో అందంగా ఉండవచ్చు, అయినా అక్కడికి పోవటం నీకు మంచిది కాదు," అని హెచ్చరించి సంచారానికి బయలుదేరాడు.

ఈ మాట విన్నదే తడవుగా కుశలుడికి ఆ లోయ చూడాలనిపించింది. తాను ఉన్న ఈ లోకంలో ముసలితనం లేదన్న మాటే గాని ఇంకేమీ కూడా లేదు. అది చూడటానికి అందమైన చోటైనా కాదు. ఈ పశ్చాత్తాప లోయలో ఎన్ని వింతలైనా ఉండవచ్చు ననుకుని కుశలుడు అక్కడికే బయలుదేరాడు.

కాని పశ్చాత్తాపలోయలోకి అడుగు పెట్టగానే కుశలుడికి అంతులేని దుఃఖం ముంచుకొచ్చింది. అతను విపరీతంగా ఏడ్చాడు. ఆ ఏడుపు వల్ల అతని మనస్సుకు కొంత ఆనందం కలిగింది. ఇంతకాలమూ లేని విచారాలన్నీ అతన్ని ఒక్క సారిగా ముసిరాయి. తన తల్లిదండ్రులనూ, అన్నలనూ వదిలేశాడు. ఇద్దరు అద్భుతసౌందర్యవతులను పెళ్ళాడే అవకాశం దొరికితే ఆ అవకాశం వినియోగించుకున్నాడు కాడు. తనది ఒంటరి జీవితమైపోయింది ! తన జీవితం మోడుబారిపోయింది.

ఒంటరి తనంతో బాధపడుతూ కుశలుడు గుడిసెకు తిరిగి వచ్చి గాలితో, "నే నింటికి వెళ్ళి మా వాళ్ళను చూడాలని ఉంది!" అని చెప్పాడు.

"నువు వెళ్ళకు. వెళ్ళి ప్రయోజనం ఉండదు," అన్నాడు గాలి.

కాని కుశలుడు వినలేదు. అతను తన గుర్రం ఎక్కి తిరుగు ప్రయాణమయాడు. అతను కంచుకోటను చేరుకునేసరికి అక్కడ ఒక నడివయసు స్త్రీ కనిపించి, "ఇప్పుడు వచ్చావా? కాని ఏం లాభం? ఇక్కడికి ముసలితనం వచ్చేస్తున్నది. ఆ కనబడే కొండలు చూడు, దాదాపు నేలమట్టమయాయి," అన్నది.

"నిజమే. నేను ఇక్కడే ఉండిపోవలిసింది. అందు కిప్పుడు విచారిస్తున్నాను," అని కుశలు డామెవద్ద సెలవు పుచ్చుకుని, కొద్దిసేపటి కల్లా పక్షులరాణి ఉండేచోటికి

చేరాడు. అక్కడ ఉన్న అడవి అంతా పోయింది. ఒకటి రెండు చెట్లే మిగిలి ఉన్నాయి. పక్షులరాణి ఇప్పుడు నడి వయసులో ఉన్నది.

"ఇప్పుడు వచ్చావా? నువు నీ యౌవనం కాపాడుకుని సుఖపడ్డావా?" అని అడిగిందామె కుశలుణ్ణి.

"ఏమీ సుఖపడలేదు. అదే నా విచారం. నేను కూడా మానవమాత్రుణ్ణిగా జీవించి ఉండవలిసింది," అన్నాడు కుశలుడు.

అతను అక్కడినుంచి బయలుదేరి తన తండ్రి రాజ్యం చేసిన చోటికి చేరాడు. కాని అక్కడ నగరం లేదు, రాజభవనం లేదు; పొలాలు మాత్రం ఉన్నాయి.

అతను ఒక ముసలివాణ్ణి సమీపించి, "ఇక్కడ మా తండ్రిగారి రాజభవనం ఉండేది. ఏమయిందో చెప్పగలవా?" అని అడిగాడు.

"ఎవరు మీ తండ్రి?" అని ముసలివాడు అడిగాడు.

కుశలుడు తన వంశం గురించి చెప్పాడు. ముసలివాడికి కోపం వచ్చింది.

"నువు చెప్పే రాజవంశం గురించి మా ముత్తాత కూడా ఎన్నడూ చెప్పలేదు. ఎందుకు నాతో పరాచకాలాడుతున్నావు?" అన్నాడాయన.

"నేను నిజమే చెబుతున్నాను. ఇక్కడెక్కడో నేను పాతిపెట్టిన డబ్బుండాలి. అది చూస్తే నువే నమ్ముతావు!" అంటూ కుశలుడు తాను డబ్బు పాతిపెట్టిన చోటు కోసం చాలాసేపు చుట్టుపక్కల వెతికి పట్టుకున్నాడు.

అతను గుంట తవ్వి తాను పాతిపెట్టిన డబ్బు తీసి బయట పడేశాడు. కాని ఆ డబ్బుకు దిగువన వార్ధక్యం కనిపెట్టుకుని ఉండి, "ఇప్పటికి దొరికావా?" అని కుశలుణ్ణి భూమిలోకి లాక్కుపోయింది.

గుంట బయట ఉన్న ముసలివాడు ఆ డబ్బును పరీక్షించి, "ఇది ఈ యుగానిది కాదు," అనుకుని గుంట కేసి చూసేసరికి, ఆ గుంట తవ్విన వాడి జాడలేదు.

"ప్రపంచంలో ఎన్ని విచిత్రాలు!" అనుకున్నాడా ముసలివాడు.



# పాకప్రావీణ్యం

గౌతమీనగర రాజకుమారుడికి యుక్తవయను వచ్చింది. అతను తాను పెళ్ళాడగోరిన రాజకుమార్తెను వెతుకుతూ దేశాల మీద బయలుదేరి, అనేక రాజకుమార్తెలను చూశాడు.

చూసిన ప్రతి రాజకుమార్తెనూ అతను, "నీకు ఏమేమి వంటకాలు వచ్చును?" అని అడిగేవాడు. వాళ్ళు చెప్పేవాళ్ళు. అతను తృప్తిపడక అక్కడి నుంచి వెళ్ళిపోయేవాడు.

అలాగే అతను పూర్ణిమానగరానికి వెళ్ళి అక్కడి రాజకుమార్తెను, "నీకు ఏమేమి వంటకాలు వచ్చును?" అని అడిగాడు.

"మీకు ఎవరిని ఏమి అడగాలో తెలియనట్టుంది. నేను మహారాణిని. ఇంతవరకు వంట చెయ్యలేదు. ఇక ముందు కూడ చెయ్యబోను," అన్నది.

ఆ రాజకుమారుడు ఆమెను పెళ్ళాడటానికి అంగీకరించాడు.

—మారుపాక సంధ్యారాణి






# బ్రహ్మరాక్షసి

పి. ముకుందరావు

ఒక గ్రామంలో పరమకిరాతకుడైన జమీందారు ఒకడు ఉండేవాడు. ఆ గ్రామానికి సమీపంలో ఒక అడవి ఉండేది. ఆ అడవికుండా ప్రయాణించేవారిని తన మనుషుల చేత చంపించి, వాళ్ళ సొత్తు కాజేస్తూ ఉండేవాడు. ఆ అడవికుండా హెచ్చు ధనంతో ప్రయాణం చేయటం ప్రాణాపాయంగా ఉండేది.

ఒక శాస్త్రవేత్త అయిన పండితుడు రాజుగారి నుంచి గొప్ప సన్మానం పొంది, జమీందారుండే గ్రామం మీదుగా, అడవి అవతల ఉన్న తన స్వగ్రామానికి వెళుతున్నప్పుడు జమీందారు మనుషులు హఠాత్తుగా మీదపడి ఆయనను చంపి, ఆయన వద్ద ఉన్న ధనం కాజేశారు.

దొంగలు ఆయన శవాన్ని ఎక్కడో అడవిలోనే పాతెయ్యటం వల్ల ఆయన ఏమయినదీ ఎవరికీ తెలియలేదు.

కొంతకాలం గడిచింది. చనిపోయిన పండితుడి కొడుకు తన కొడుకును, పదేళ్ళ కుర్రవాణ్ణి, జమీందారు గ్రామంలో ఉన్న ఒక గురువు వద్దకు చదువుకునే టందుకు పంపాడు.

ఆ కుర్రవాడు అడవిదారిన నడుస్తూండగా ఒక ముసలి బ్రాహ్మడు కనిపించి, "నా వెంట రారా, బాబూ! నీకు సహాయం చేస్తాను," అన్నాడు. కుర్రవాడు ఆ బ్రాహ్మణుడి వెంట చెట్ల మధ్యకు వెళ్ళాడు.

అక్కడ ఆ బ్రాహ్మణుడు ఒక గుంట నుంచి ఒక చెంబు తీసి కుర్రవాడికి ఇచ్చి, "దీని నిండా బంగారం ఉన్నది. దీన్ని భద్రంగా ఉంచుకో. నువు అడవి దాటి గ్రామం చేరేసరికి చీకటి పడుతుంది. ఈ రాత్రికి జమీందారుగారిని పడుకునేటందుకు చోటు ఇయ్యమని అడుగు!" అని చెప్పి ఎటో వెళ్ళిపోయాడు.

కుర్రవాడు చెంబుకు కట్టిన వాసెనగుడ్డ విప్పి చూస్తే అందులో నిజంగానే బంగారపు నాణాలు ఉన్నాయి. తనకు అంత డబ్బు అడగకుండా ఇచ్చిన ఆ బ్రాహ్మణ్ణి గురించి, ప్రేమగా ఆలోచిస్తూ కుర్రవాడు తన దారిన బయలుదేరాడు.

వాడు గ్రామాన్ని చేరేసరికి చీకటిపడింది. బ్రాహ్మడు చెప్పిన ప్రకారం వాడు జమీందారు ఇల్లు కనుక్కొని వెళ్ళి, ఆ రాత్రికి తనకు పడుకునేటందుకు చోటు చూపించమన్నాడు. జమీందారు అందుకు సమ్మతించాడు.

ఆ రాత్రి కుర్రవాడు నిద్రపోగానే జమీందారు అటుగా వచ్చి, కుర్రవాడి పక్కనే ఉన్న చెంబు ఎత్తి చూశాడు. బరువుగా ఉన్నది. దాని మూతికి కట్టి ఉన్న గుడ్డ విప్పి, లోపల ఉన్న బంగారం చూశాడు.

అంత చిన్న కుర్రవాడికి అంత బంగారం ఎక్కడ నుంచి వచ్చింది? వాడు దాన్ని ఏం చేసుకుంటాడు? వాడికి అది ఎవరిచ్చారు? ఈ విషయాలన్నీ విచారణ చేసే అధికారం జమీందారు కున్నది. కాని బంగారం గుట్టుచప్పుడు కాకుండా తీసేసుకుంటే సరిపోయేదానికి బహిరంగ విచారణ దేనికి?

అందుచేత జమీందారు చెంబులో ఉన్న బంగారం తీసేసుకుని, చెంబుకు మళ్ళీ



గుడ్డవాసెన కట్టి, వెళ్ళి పడుకుని నిశ్చింతగా నిద్రపోయాడు.

కుర్రవాడు మర్నాడు ఉదయం లేచి, వెళ్ళిపోదామని చెంబు తీసుకుంటే అది తేలికగా ఉన్నది. గుడ్డ విప్పి చూస్తే లోపల బంగారం లేదు. వాడు జమీందారు దగ్గిరికి వెళ్ళి, "అయ్యా, నా చెంబు నిండా బంగారం ఉండాలి. దాన్ని ఎవరో దొంగిలించారు," అన్నాడు.

"నాకు దొంగతనం అంటగడతావురా? నే నెవరనుకున్నావు? నా మీద ఈ నింద మోపినందుకు నిన్ను ఉరితీస్తాను," అని జమీందారు తన భటుల చేత ఆ కుర్రవాణ్ణి ఒక కొట్లో పెట్టించాడు.




# అలీబాబా నలభైదొంగలు

## 2

కాశింభార్య తాను చేసిన యుక్తి మొగుడికి చెప్పి, "చూస్తూ ఊరుకోవటానికి ఎంత మాత్రమూ వీల్లేదు. నువు వెంటనే వెళ్ళి, ఆ దౌర్భాగ్యుడికి బళ్ళకొద్ది బంగారం ఎక్కడ దొరికిందో గట్టిగా అడిగి బయట పెట్టించు!" అన్నది.

తన భార్య అన్న మాటలనుబట్టి తన తమ్ముడి కెక్కడో నిధి దొరికిందని కాసిం గ్రహించాడు. అయితే, తన తమ్ముడి దరిద్రం తీరిపోయింది గదా అని అతనికి సంతోషం కలగకపోగా, ఓర్చలేని తనంతో కడుపుఉబ్బరం పుట్టు కొచ్చింది. అందు చేత అతను, సంగతేమిటో తెలుసుకు వద్దామని హడావిడిగా తమ్ముడి ఇంటికి పరిగెత్తాడు.

అతను వెళ్ళేటప్పటికి తవ్వగోల ఇంకా అలీబాబా చేతిలోనే ఉన్నది. కాసిం అతన్ని చూస్తూనే ధాష్టీకంగా, "ఏమిరా, గాడిదలను తోలుకునేవాడా? మా దగ్గిరే దాపరికమా? చాటుగా బంగారాన్ని పాత్రలతో కొలుస్తూ పైకి గర్భదరిద్రుడిలా నటిస్తావా?" అని అడిగాడు.

ఈ మాటలకు అలీబాబా బాధపడి, తన అన్నా వదినెల ధనదాహం ఎరిగినవాడు కావటం చేత, "నువ్వనే దేమో నా కర్థం కావటంలేదు. ఇన్నాళ్ళూ మన మధ్య ఉన్న రక్తసంబంధాన్ని నువు మరిచిపోయి మా మీద శీతకన్ను వేసినప్పటికీ, నువు స్పష్టంగా మాట్లాడితే, నేను దాచకుండా నిజం చెబుతాను," అన్నాడు.

"అప్రస్తుతంగా మాట్లాడకు. ఏమీ ఎరగనట్టు నటించకు. నువేం దాస్తున్నదీ నాకు తెలుసు," అంటూ కాసిం తన తమ్ముడికి కొవ్వు అంటి ఉన్న దీనారం చూపి, "ఇలాటివి ఎన్ని మానికలు దాచబెట్టావురా, దొంగ వెధవా? అదంతా ఎక్కడ దొంగిలించావు?"

అరేబియా జానపద కథ

లోపలికి వెళ్ళి, మంత్రం చదివి రాయిని మూసేశాడు. తనకు రానున్న ప్రమాదం తెలిసి ఉంటే అతను అలా చేసి ఉండడు.

లోపల వున్న బంగారమూ, రంగురంగుల రత్నాల రాసులూ చూస్తూంటే అతని కళ్ళు చెదిరిపోయాయి. అక్కడ ఉన్న దంతా తనది కావాలని అతని హృదయం ఆక్రోశించింది. అదంతా చేరవేయటానికి ఒక ఒంటెల మంద చాలదనీ, చాలా మందలు అవసరమనీ అతను తెలుసుకున్నాడు. ప్రస్తుతానికి అతను తన వెంట ఉన్న పది పెట్టెల లోనూ పట్టదగినన్ని సంచులను మాత్రమే నించుకున్నాడు. ఈ పని పూర్తి కాగానే అతను ద్వారం కేసి తిరిగి, "తెరుచుకో, జవా!" అన్నాడు.

ఆ దౌర్భాగ్యుడికి ఆ నిధు లన్నీ చూసే సరికి భ్రమ కలిగి, అసలు మాట గుర్తు రాకుండా పోయింది. అందుచేత అతను, "తెరుచుకో, జవా!" అని మళ్ళీ మళ్ళీ అనసాగాడు. కాని రాయి తెరుచుకోలేదు. అందుచేత అతను ఇంకో ధాన్యం గింజ పేరు అన్నాడు.

అతను ఎన్ని పేర్లు పఠించినా రాయి మూసుకునే ఉన్నది. ఆ రాయి కేసి చూస్తుంటే అతనికి దడపుట్టుకొచ్చింది. అతను నువ్వు గింజ (సమ్‌సమ్) పేరు తప్ప మిగిలిన పేర్లన్నీ అన్నాడు. ఎప్పటికో ఒకప్పటికి దేవుడు దుర్మార్గులను తీవ్రంగా శిక్షించటానికి వాళ్ళ మెదడుకు మైకం కలిగిస్తాడు.



ఆమె ఆందోళన చెంది, తన అహంకారం చంపుకుని అలీబాబా ఇంటికి వెళ్ళి, "మరిదీ, మీ అన్న అరణ్యానికి వెళ్ళి తిరిగి రాలేదు. వెంటనే వెళ్ళి అయన ఏమయినదీ కాస్త చూసి వస్తావా ఏమిటి?" అని ప్రాధేయ పడింది.

అలీబాబాది మెత్తని గుండె. అతను కూడా అన్నను గురించి ఆందోళన పడుతూ, "అన్నను అల్లా కాపాడుగాక! నేను వెంట వస్తానంటే విన్నాడు కాదు. అయినా నువ్వేమీ కంగారు పడకు, వదినా. ఒకవేళ అతను ఊరంతా మాటుమణిగాక వద్దామను కున్నాడో ఏమో!" అన్నాడు. తాను చీక టిలో బయలుదేరి ప్రయోజనం ఉండదనీ, తెల్లవారి బయలుదేరతాననీ, ఆ రాత్రి తన వదినగారు తన ఇంట్లోనే పడుకోవలసిందనీ అన్నాడు అలీబాబా.

సూర్యోదయం అవుతూండగా అతను తన మూడు గాడిదలనూ తోలుకుని, అరణ్యంలో ఉన్న గుహకు వెళ్ళాడు. తన అన్న తెచ్చిన కంచరగాడిదలు కనిపించక పోవడంతో అత నికి అనుమానం కలిగింది; రాతి దగ్గిర నెత్తురు మరకలు కనిపించేసరికి అతనికి నిజం తెలిసిపోయింది. వణుకుతున్న కంఠంతో అతను, "తెరుచుకో, సమ్‌సమ్!" అన్నాడు. రాయి తెరుచుకున్నది. లోపలికి అడుగు పెట్టి తన అన్న శరీరభాగాలను చూసేసరికి అతనికి కాళ్ళు వణికాయి,

అన్నకు శాస్త్రోక్తంగా ఉత్తరక్రియలు జరిగి తీరాలి గనక, అతను గుహ నుంచి





రాతిని తెరుచుకునేలాగు చెయ్యటం సాధ్యం కాక అతను, బయటపడటానికి మరేదైనా దారి ఉందేమో నని లోపల వెతక సాగాడు. ఎటు చూసినా అతనికి నున్నని పలుగురాయి గోడే కనిపించింది.

మిట్టమధ్యాన్నం వేళ నలభై మంది దొంగలూ తమ గుహను చేరి, బయట కట్టేసి ఉన్న పది కంచరగాడిదలనూ, వాటి మీద ఉన్న ఖాళీ పెట్టెలనూ చూశారు. అందరూ కూడబలుక్కున్నట్టుగా కత్తులు దూసి, రాయి కేసి గుర్రాలను పరిగెత్తించి వచ్చారు. దొంగల నాయకుడు తన కత్తిని రాయి కేసి చాచి, "తెరుచుకో, సమ్‌సమ్," అన్నాడు. రాయి తెరుచుకున్నది.

కాసిం దొంగల కేకలూ, డెక్కల చప్పుడూ వింటూనే రాయి పక్కగా ఒక మూల నక్కి, రాయి తెరుచుకోగానే బయటికి ఉడాయింతా మనుకున్నాడు. కాని అతను దొంగలకు చిక్కిపోయాడు. అతన్ని దొంగలు తమ కత్తులతో రెప్పపాటులో ఆరు ఖండాలుగా నరికేశారు.

కాసిం జీవితం అలా ముగిసింది.

దొంగలు తమ కత్తులను తుడుచుకుని, లోపలికి వెళ్ళి, నిధులతో నింపి ఉన్న కాసిం సంచులను కుమ్మరించేశారు. అలీ బాబా తీసుకుపోయిన సొమ్ము వారు తెలుసుకోలేక పోయారు. జరిగినదాన్ని గురించి వాళ్ళు వితర్కించుకున్నారు గాని, వాళ్ళకేమీ అంతుపట్టలేదు. వాళ్ళు దీర్ఘాలోచనకు అలవాటు పడ్డవాళ్ళు కాకపోవటం చేత, సమస్యలను అలాగే వదిలేసి, రాతిని ఎప్పటిలా మూసి కొత్త దోపిడీలు చెయ్యటానికి బయలుదేరి పోయారు.

కాసిం చావదగినవాడే అయినప్పటికీ, అతని చావుకు అసలు కారణం దుర్మార్గురాలైన అతని భార్య. ఆమె కొలపాత్రలో కొవ్వు అంటించినందుకు ఫలితమే కాసిం ఆరు ఖండాలుగా తెగిపోవటం. తన భర్త నిధితో తిరిగి వస్తాడనుకుని ఆమె విందు భోజనం తయారుచేసి ఎదురు చూడసాగింది. చీకటి పడినా అతని జాడ లేకపోయేసరికి



రెండు పెద్ద సంచులు తెచ్చి, వాటిలో కాసిం శరీర భాగాల నుంచి, ఆ సంచులను తన గాడిదలలో ఒకదాని మీద వేసి, వాటి పైన ఆకులూ, కొమ్మలూ కప్పి, తన ప్రయాణం నిరర్థకం కాకుండా ఉండగలందులకు మిగిలిన రెండు గాడిదల మీదా దీనారాల సంచులు వేసి, వాటిని కూడా భద్రంగా కప్పి, గుహ ద్వారం మూసి, విచారంగా ఇంటికి తిరిగి వెళ్ళాడు.

అలీబాబా తన గాడిదలను తన ఇంటి ఆవరణలోకి తెచ్చి, సంచులు దించటానికి మర్జీనా అనే బానిసపిల్లను కేక వేశాడు. ఈ మర్జీనా పసిపిల్లగా ఉండగా అలీబాబా, అతని భార్యా చేరదీసి, తమ పిల్లలను పెంచినంత శ్రద్ధాసక్తులతో పెంచారు. ఆమె ఆ ఇంటనే పెరిగి యుక్తవయస్కురాలై, పదిమంది పెట్టుగా పని చేస్తూ, పెంపుడు తల్లికి చేదోడుగా ఉంటున్నది. ఆమె ఎంత సాధుస్వభావురాలో అంత యుక్తిపరురాలు; ఎంత గడ్డు సమస్య వచ్చినా తన బుద్ధి ఉపయోగించి ఇట్టే విడగొట్టేది.

అలీబాబా కేక విని మర్జీనా మిద్దె మీది నుంచి దిగి వచ్చింది.

"అమ్మా, మర్జీనా! ఇవాళ నీ తెలివి తేటలు చూపాలి," అని అలీబాబా ఆమెతో తన అన్నకు జరిగినది చెప్పి, "అతని శరీర ఖండాలు మూడో గాడిదె మీద ఉన్నాయి. నేను వెళ్ళి మా వదినకు ఈ దారుణవార్త చెప్పి వస్తాను. ఈ లోపుగా నువు ఆలోచించి, అతను మామూలు చావు చచ్చినట్టు నాటకం ఆడి, అతన్ని పాతిపెట్టే ఉపాయం చూడు," అన్నాడు.

మర్జీనా అలాగే చూస్తానన్నది. అలీబాబా మిద్దె మీదికి వెళ్ళాడు.

అతని ముఖం చూడగానే కాసిం భార్య ఏదో దారుణం జరిగిపోయిందని గ్రహించి, గట్టిగా ఏడ్చింది. ఆమె జుట్టు పీక్కుని అఘాయిత్యం చెయ్యబోతూండగా అలీబాబా జరిగినది పొడిమాటలలో గబగబా చెప్పి, "చూడు, వదినా. నా కిప్పుడు పుష్కలంగా

డబ్బున్నది. ఈ విపత్తులో నీకు సహాయంగా ఉండటానికి నా సంపదలో నీవంతు నీ కిస్తాను. నీకు అభ్యంతరం లేకపోతే ఈ ఇంట్లోనే ఉండవచ్చు. నా భార్య నిన్ను అక్కలాగా చూసుకుంటుంది. అందరమూ సుఖంగా జీవించవచ్చు," అన్నాడు.

అలీబాబా మంచితనం గ్రహించి ఆమె తన దుస్వభావాన్ని మార్చుకుని, అతను చెప్పినట్టు చెయ్యటానికి ఒప్పుకున్నది. ఈ విధంగా అలీబాబా తన వదినెగారి ఏడుపులూ, రాగాలూ మానిపించి, మిద్దె దిగి మర్జీనా వద్దకు వచ్చాడు.

ఈ లోపల మర్జీనా ఉపాయం ఆలోచించటమూ, దాని ప్రకారం పని ప్రారంభించటమూ కూడా అయింది. ఆమె ఒక మందులమ్మేవాడి వద్దకు వెళ్ళి, అపాయకరమైన విషాలకు విరుగుడు ఇవ్వమని అడిగింది.

"మందు ఎవరికి ?" అని అమ్మేవాడు అడిగాడు.

మర్జీనా నిట్టూర్చి, "అయ్యో, మా యజమాని అన్నగారిని ఎర్రనాగు కాటేసింది. ఆయన్ని మా యింటికి తెచ్చారు. ఎన్నో చేశాం. లాభం లేకపోయింది. ముఖం పచ్చబారి పోయింది. కళ్ళు కనపడవు. మాట పడిపోయింది. మనిషిలో చలనం లేదు. మీ మందు మీదే అన్ని ఆశలూ పెట్టుకుని



ఉన్నాం!" అని మందుతో ఇంటికి తిరిగి వచ్చింది.

ఆమె వేసిన ఎత్తును అలీబాబా చాలా మెచ్చుకున్నాడు.

మర్నాడు ఉదయం మర్జీనా మందులమ్మేవాడి దగ్గిరికి ఏడుస్తూ వెళ్ళి, గరళం కావాలని అడిగి, "ఇది కూడా పని చెయ్యకపోతే ఇక ఆశ లేదు," అన్నది. ఆమె గరళం తీసుకుని ఇంటికి వస్తూ ఆ పేటలో వారందరికీ దుర్వార్త తెలిపింది. అందుచేత అలీబాబా ఇంట్లో నుంచి ఏడుపులూ, పెడబొబ్బలూ వినిపించినప్పుడు ఎవరూ ఆశ్చర్యపోలేదు; కాసిం పోయాడు కాబోలు ననుకున్నారు.

బలవన్మరణం సహజ మరణమేనని లోకాన్ని నమ్మించటంతో మర్జీనా తృప్తిపడ లేదు; కాసిం శరీరం ఆరు ఖండాలైన సంగతి ఎవరికీ తెలియకుండా చేయాలని నిశ్చయించుకున్నది. అందుచేత ఆమె వగలవిడుపు ముగియగానే ఇంటి నుంచి బయలుదేరి, తన కెవరూ తెలిసినవాళ్ళులేని మారుమూలపేటలో ఒక చెప్పులు కుట్టేవాడి వద్దకు వెళ్ళి, వాడి చేతిలో ఒక బంగారు దీనారం ఉంచి, "నీ తెలివి తేటలన్నీ ఇవాళ చూపాలి, షేక్ ముస్తఫా!" అన్నది.

"మంచి బోణీ చేశావు, పిల్లా! ఏం కావాలో చెప్పు, చేస్తాను," అన్నాడు ముస్తఫా సంతోషంగా.

"తోళ్ళు కుట్టటానికి ఏం కావాలో అదంతా పట్టుకుని నా వెంటరా. అయితే నీ కళ్ళకు గంతలు కట్టి తీసుకుపోతాను. అందుకు నువు ఒప్పుకోవాలి," అన్నది మర్జీనా.

"ఒక్క దీనారానికి నన్ను కూడని పని చెయ్యమంటావా?" అన్నాడు చెప్పులు కుట్టేవాడు.

"నీ అంతరాత్మ కోసం ఇంకో దీనారం ఇంద! నువు చెయ్యవలసినది తోళ్ళు కుట్టటం మాత్రమే," అన్నది మర్జీనా, అతని చేతిలో రెండో దీనారం పెట్టి.

చెప్పులు కుట్టేవాడు తృప్తిపడి, ఆమె చేత కళ్ళకు గంతలు కట్టించుకుని, ఆమె వెంట వీధుల వెంబడి నడిచి, అలీబాబా ఇంటి నేలమాళిగకు చేరాడు. అక్కడ మర్జీనా అతని కళ్ళ గంతలు విప్పి, తాను పేర్చిపెట్టిన శవఖండాలు చూపింది. తరవాత ఆమె అతని చేతిలో మరోబంగారు దీనారం పెడుతూ, "ఈ శవాన్ని కలిపి కుట్టాలి. పని త్వరగా ముగించావంటే మరో దీనారం కూడా దొరుకుతుంది," అన్నది.

ముసలాడు తన అదృష్టానికి మురిసిపోయి, చకచకా కాసింశరీరాన్ని కలిపి కుట్టేసి ఏకం చేశాడు. మర్జీనా నాలుగో దీనారం కూడా అతని చేతిలో పెట్టి, అతని కళ్ళకు మళ్ళీ గంతలు కట్టి, అతన్ని అతని దుకాణం వద్ద దిగబెట్టి, తిరిగి వచ్చేసింది.

—(ఇంకా వుంది)






దుర్యోధనుడు పాండవులపై గల ఈర్ష్యతో మనోవ్యాధిపడి కృశించసాగాడు. అతని స్థితి చూసి శకుని, "దుర్యోధనా, ఏమిటిలా చిక్కిపోయావు? నీకు పట్టుకున్న విచారమేమిటి?" అని అడిగాడు.

దానికి దుర్యోధనుడు, "మామా, ఏం చెప్పమన్నావు? అర్జునుడి పరాక్రమం ఆధారంగా చేసుకుని ధర్మరాజు భూమండలమంతా గెలిచి, రాజసూయయాగం చేసి సామ్రాజ్యలక్ష్మిని వరించాడు. రాజులందరూ అతనికి వశులైనారు. కృష్ణుడు శిశుపాలుణ్ణి నిండు సభలో వధిస్తే ఒక్కరు కూడా కిక్కురుమనలేదు. రాజు లందరూ రత్నరాసులు తెచ్చి పాండవుల కాళ్ళ ముందుపోశారు. వారి వైభవం వర్ణనాతీతం. వాళ్ళ ఐశ్వర్యం చూసి నేను పనికిమాలిన వాణ్ణి అయిపోయాను. మనం మయసభ చూసేటప్పుడు నన్ను చూసి వాళ్ళు ఎలా హేళన చేశారో నువ్వు చూశావు గదా! నాకు జీవితం దుర్భరంగా ఉన్నది. నా బాధ మా తండ్రితో చెప్పు," అన్నాడు.

ఈ మాటలు విని శకుని దుర్యోధనుడితో, "నువ్వు పాండవుల సంపద చూసి అసూయ పడటం దేనికి? వాళ్ళా సంపదను సక్రమంగానే సాధించుకున్నారు. వారికి దైవబలం జాస్తిగా ఉన్నది. అందుకే, వాళ్ళను నువ్వు నిర్మూలించటానికి చేసిన ప్రయత్నం ఒక్కటీ ఫలించలేదు. ద్రౌపది వారికి భార్య కావటం వాళ్ళకొక గొప్ప అదృష్టం; ద్రుపదుడు వాళ్ళకు పెద్ద అండఅయాడు.

## 24. మాయజూదం



కృష్ణుడి సంగతి చెప్పనే అవసరం లేదు; అతను చిన్నతనం నుంచీ వారిని కంటిని రెప్పలాగా కాపాడుతున్నాడు. ఖాండవ దహనం ధర్మమా అంటూ అర్జునుడు అగ్ని దేవుడి సహాయంతో గాండీవమూ, అక్షయ తూణీరాలూ, దివ్యాస్త్రాలూ సాధించుకున్నాడు; వాటితోనే రాజులందరినీ జయించాడు. ఖాండవదహనం మూలానే వారికి మయసభ కూడా లభించింది. ఇందులో అధర్మమేమున్నది? అయినా, అంత మాత్రాన నీ కెవరూ లేనట్టు మాట్లాడతావెందుకు? ఆ మాటకు వస్తే నీ కున్న అంగబలం వారి కెక్కడిది? నీకు తొంభై తొమ్మిదిమంది తమ్ములూ, మహా విలుకాడు ద్రోణుడూ, సమస్త అస్త్రాలనూ తెలిసిన అశ్వత్థామా, కర్ణుడూ, కృపాచార్యుడూ, నేనూ, అందరమూ లేమా?'' అన్నాడు.

"అలా అయితే మనం సైన్యాలను తీసుకుని పోయి పాండవులతో యుద్ధం చేసి, ఆ మయసభను హస్తినాపురానికి తెచ్చుకుందాం," అన్నాడు దుర్యోధనుడు.

"దుర్యోధనా, పాండవులను గెలవటం అంత తేలిక కాదు. యుద్ధం దేనికి? అంతకన్న వారిని జయించే సులభోపాయం చెబుతాను విను. ధర్మరాజుకు జూదం చాలా ఇష్టం. అతన్ని జూదానికి పిలు. నేను అతన్ని జూదంలో ఓడించి, అతని రాజ్యాన్నీ, సంపదనూ కాజేసి నీ కిస్తాను. ధృతరాష్ట్రుడి అనుమతి మాత్రం సంపాదించు" అన్నాడు శకుని.

శకుని దుర్యోధనుణ్ణి వెంటబెట్టుకుని ధృతరాష్ట్రుడి దగ్గిరికి వెళ్ళేసరికి ధృతరాష్ట్రుడు ధర్మరాజు పూర్తి చేసిన రాజసూయం గురించి ఎంతో సంబర పడుతున్నాడు. శకుని ఆయనతో, "మన దుర్యోధనుడు చిక్కి సగమయాడు. అతని ముఖం కళాహీనమయి పోయింది," అన్నాడు.

ఈ మాటకు ధృతరాష్ట్రుడు అదిరిపడి, దుర్యోధనుణ్ణి దగ్గిరికి తీసుకుని, శరీరం నిమిరి, "ఇలా చిక్కిపోవటానికి నీ కేమి కష్టం వచ్చిందిరా?" అని అడిగాడు.

దానికి దుర్యోధనుడు, "నాకు మనో వ్యాధి పట్టుకున్నది. నిద్ర రాదు. భోజనం రుచించదు. ఎందువల్లా సంతోషం కలగదు. శత్రువుల వైభవం చూసి నా కీ మనోవ్యాధి పట్టుకున్నది. ధర్మరాజుకు గల సంపద పూర్వం ఏ రాజుకూ ఏనాడూ లేదు. నేను చిక్కిపోక ఏం చేస్తాను?" అన్నాడు.

తరవాత శకుని దుర్యోధనుడితో, "రాజా, ధర్మరాజుకు జూదమంటే తగని వ్యసనం, కాని ఆటలో నేర్పు లేదు. నేను జూదంలో ఆరితేరినవాణ్ణి. నా యుక్తితో ధర్మరాజు సంపద అంతా నీకు దక్కేటట్టు చెయ్య గలను. యుద్ధానికి గాని, జూదానికి గాని సాటిరాజు అహ్వానించినప్పుడు నిరాకరించటం క్షత్రియధర్మం కాదు. అందుచేత మనం పిలిస్తే ధర్మరాజు జూద మాడటానికి వస్తాడు," అన్నాడు.

అప్పుడు దుర్యోధనుడు తండ్రి కాళ్ళ మీద పడి, శకుని చెప్పినట్టు చెయ్యటానికి అనుమతి వేడుతూ, కన్నీరు కార్చాడు.

ధృతరాష్ట్రుడు దుర్యోధనుడితో, "విదురుడి సలహా తీసుకుని అతను ఏం చెయ్య మంటాడో చూద్దాం," అన్నాడు.

"విదురుడితో చెబితే ఈ ఆలోచనకు ఎంత మాత్రమూ ఒప్పుకోడు. దీనికి నువు ఒప్పుకోకపోతే నేను బతకను. ఆ తర్వాత నువ్వూ, విదురుడూ ఈ రాజ్యాన్ని నెత్తిన



కట్టుకుని ఊరేగండి," అన్నాడు దుర్యోధనుడు, చనువుతోనూ, నిరాశతోనూ.

ధృతరాష్ట్రుడికి పుత్రమోహం జాస్తి కావటం చేత దుర్యోధనుడి ఆలోచనకు ఎదురు చెప్పలేక పోయాడు. ఆయన శిల్పాచార్యులను అనేకమందిని పిలిపించి, మయ సభ లాటి సభను నిర్మించమనీ, దానికి వెయ్యి స్తంభాలూ, నూరు వాకిళ్ళూ, రక రకాల బొమ్మలతో కూడిన మంటపమూ ఏర్పాటు చేయమనీ చెప్పాడు. తరవాత ఆయన విదురుణ్ణి పిలిపించి, ఆయనతో తన దురుద్దేశం చెప్పక, ధర్మరాజును జూదానికి రమ్మనమని ఆహ్వానించటం గురించి మాత్రం చెప్పాడు.



విదురుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, ఈ ఆలోచన నాకు సమ్మతం కాదు. జూదం కారణంగా పిల్లల మధ్య వైరం ఏర్పడుతుంది. ఈ ఆలోచన మాను," అన్నాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "విదురా, ఇందులో మంచిచెడ్డ లేమైనా ఉన్నప్పటికీ స్నేహపూర్వకంగా జూదం జరిగి తీరాలి. కుమారుల మధ్య వైరం వస్తే వారించడానికి నేనూ, నువూ, భీష్ముడూ, ద్రోణుడూ లేమా? నువు రథం మీద ఇంద్రప్రస్థానికి వెళ్ళి ధర్మరాజును ఇక్కడికి తీసుకురా," అన్నాడు.

విదురుడు ఈ సంగతి భీష్ముడితో చెప్పి ఆయన అభిప్రాయం తెలుసుకునేటందుకు బయలుదేరాడు. అతడు వెళ్ళగానే ధృతరాష్ట్రుడు తన కొడుకును పిలిచి, ఈ జూద ప్రయత్నం మానుకోమని చెప్పి చూశాడు. కావలిస్తే నువు కూడా రాజసూయం చేసి సామ్రాజ్యం సంపాదించ మన్నాడు. కాని దుర్యోధనుడు వినిపించుకో లేదు. జూదం కూడా ఒక విధమైన యుద్ధమే ననీ, అందులో నేర్పును బట్టి జయాపజయా లుంటాయనీ శకుని అన్నాడు.

ఈ లోపల ధృతరాష్ట్రుడు కోరిన ప్రకారం హస్తినాపురంలో కూడా ఒక గొప్ప సభా భవనం తయారయింది. ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి, కొత్త సభలో స్నేహపూర్వకంగా జూదం ఆడటానికి ధర్మరాజును పిలుచుకుని రమ్మని ఆజ్ఞాపించాడు.

తన కిక తప్పదని గ్రహించి విదురుడు రథం మీద ఇంద్రప్రస్థానికి వెళ్ళాడు. ధర్మరాజు ఆయనకు తగిన సత్కారాలు చేసి, "విదురా, క్షేమంగా ఉన్నావా? నీ ముఖం వాడిపోయి ఉన్నదేం? ధృతరాష్ట్రుడూ, దుర్యోధనాదులూ సుఖంగా ఉన్నారా?" అని కుశల ప్రశ్నలు చేశాడు.

దానికి విదురుడు, "అందరూ క్షేమంగానే ఉన్నారు. నీ మయసభలాంటిది హస్తినాపురంలో కూడా కట్టారు. నువు నా వెంట వచ్చి, ఆ సభలో కొన్నాళ్ళు దుర్యోధనాదులతో కులాసాగా గడిపి, వాళ్లతో స్నేహపూర్వకంగా జూద మాడాలట.

ఈ మాట ముసలిరాజు నీతో చెప్పమన్నాడు. నీతో జూదమాడితే గాని ఆయనకూ, ఆయన కొడుకులకూ సుఖం ఉండదుట. ఆ దుర్మా ర్గుల కోరిక తీర్చు," అన్నాడు.

ఆ మాట విని ధర్మరాజు, "అయ్యయ్యో. పెద్దలు జూదమాడతారా? దానివల్ల తప్పక తగాదా వస్తుంది. నీ ఉద్దేశం ఏమిటి? నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను," అన్నాడు.

"జూదం కలహకారణమని నేను ఎంత చెప్పినా ఆ గుడ్డిరాజు వినిపించుకోక, నిన్ను తీసుకు రమ్మని నన్ను పంపాడు. నువ్వే ఆలోచించి యుక్తమని తోచినట్టు చెయ్యి," అన్నాడు విదురుడు ధర్మరాజుతో.

"అక్కడ జూదమాడటానికి ఉబలాట పడుతున్నవారెవరు?" అని ధర్మరాజు అడిగాడు.

"శకునీ, వివింశతీ, చిత్రసేనుడూ, సత్య వ్రతుడూ, పురుమిత్రుడూ, జయుడూ," అని విదురుడు చెప్పాడు.

"జూదరులంతా ఒక చోట చేరారన్న మాట. కాని ఆపద కలిగి తీరుతుంది. పెద్దలు పిలిస్తే వెళ్ళకపోరాదు. జూదానికి పిలిస్తే పోకుండా ఉండరాదని నా నియమం. చాలా భయంగా ఉన్నది. ఏమయితే అవు తుంది, రేపు బయలుదేరుతాను," అన్నాడు ధర్మరాజు.



ప్రయాణ సన్నాహం జరిగింది. ధర్మ రాజు తన తమ్ములనూ, ద్రౌపదినీ వెంట బెట్టుకుని హస్తినాపురానికి వచ్చాడు; పెద్ద లయిన ధృతరాష్ట్ర, భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామలకు నమస్కారాలు చేశాడు. చిన్నవారిని పలకరించి, గాంధారితో కుశల ప్రశ్నలు జరిపాడు. ద్రౌపది ముఖాన మహా రాణి కళ గమనించి, దుర్యోధనుడు మొద లయిన వాళ్ళ భార్యలు అసూయపడ్డారు.

ఆ రోజు గడిచి మర్నాడు తెల్లవారగానే ధర్మరాజు కాలకృత్యాలు తీర్చుకుని, శకునీ, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ మొదలైన వాళ్ళున్న జూద మాడే ఇంటికి వచ్చి, పెద్దలందరికీ నమస్కారాలు చేశాడు.



అప్పుడు శకుని ధర్మరాజుతో, "రాజా, నిన్ను చూడటానికి కొందరు ఈ సభకు వచ్చారు. మరి కొందరు కాలక్షేపం కోసం నీతో జూదమాడ వచ్చారు. అందుచేత నియమాలు ఏర్పాటు చేసుకుని, ఈ పాచికలతో జూదం ప్రారంభింతాం," అన్నాడు.

దానికి ధర్మరాజు, "శకునీ, జూదంలో మోసం చెయ్యటం చాలా పాపం. అందులో క్షత్రియుడి ఘనత ఏమీ బయట పడదు. అందుచేత మోసంతో మమ్మల్ని జూదంలో గెలవటానికి ప్రయత్నించకు. మేము సంపాదించుకున్న ధనం బ్రాహ్మణ సంరక్షణార్థమూ, దుష్ట శిక్షణార్థమూ వినియోగిస్తున్నాం," అన్నాడు.

"వేదాధ్యయనంలో సమర్థుడైన శ్రోత్రియుడు మరొక శ్రోత్రియుణ్ణి వేదాధ్యయనంలోనే గెలుస్తాడు. అలాగే మోసం చేసే జూదరిని మోసంతోనే గెలవాలి. ఇది సహజం. జూదమాడటం నీ కిష్టంలేని పక్షంలో మానెయ్యి," అన్నాడు శకుని.

ధర్మరాజు పౌరుషం వచ్చి, "జూదానికి పిలవబడి వచ్చి వెనక్కు పోవటం అగౌరవం. అందుచేత ఆడతాను. నా కెదురాడే వారెవరు?" అని అడిగాడు.

"నా పక్షాన మా మేనమామ శకుని ఆడతాడు. అతను ఏ పందెం కాసినా నేను ఇస్తాను," అన్నాడు దుర్యోధనుడు.

"ఒకరి పక్షాన మరొకరు ఆడగా నే నెన్నడూ చూడలేదు, వినలేదు. ఇది అపూర్వంగా ఉన్నది. అయినా మీ ఇష్టప్రకారమే కానివ్వండి," అన్నాడు ధర్మరాజు.

జూదం చూడటానికి ధృతరాష్ట్రుడు తన వెంట రమ్మని పిలవగా కౌరవ వృద్ధులూ, భీష్మ ద్రోణ కృప విదురులూ వచ్చి, సభను అలంకరించారు.

మొదటి పందెంగా ధర్మరాజు తన హారానికి గల మణిపూస ఒడ్డితే, దుర్యోధనుడు తన వద్ద ఉన్న మణిరాసులన్నీ ఒడ్డాడు. పందెం వెయ్యగా ధర్మరాజు ఒడ్డిన మణి పోయింది. అది మొదలు ధర్మరాజు పందెం ఒడ్డిన ప్రతిదీ శకుని గెలిచాడు. జూదంలో

ఓడిపోతున్న కొద్దీ ధర్మరాజుకు మత్సరం జాస్తి అయింది. అతను బంగారాన్నీ, గుర్రాలనూ, రథాలనూ, దాసీజనాన్నీ, నిధులనూ పణంగా పెట్టి అన్నిటినీ పోగొట్టుకున్నాడు.

ఇలా సాగుతున్న అన్యాయాన్ని సహించలేక విదురుడు ధృతరాష్ట్రుడితో, "చావనున్నవాడికి దివ్యౌషధాలు రుచించవన్నట్టు, మా మాటలు నీకు రుచించవు. నీ కొడుకు కులం చెరచటానికి పుట్టాడు. నువే ఈ మోసపు జూదాన్ని ఏర్పాటు చేసి పాండవుల ధనం అపహరిస్తున్నావు. దీని వల్ల నీకు చాలా హాని కలుగుతుంది. నా మాట విని, వారికి ఆగ్రహం కలగనియ్యకు. పాండవుల సొత్తు కాజేసి ఆనందించటం కాదు, రేపు వారి అగ్రహానికి గురికావాలి. మీరు నిశ్చయంగా నిర్మూల మవుతారు. అందుచేత ఈ జూదం ఆపించు," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఈ మాటలు వినిపించుకోలేదు. కాని దుర్యోధనుడు మాత్రం విదురుణ్ణి నానామాటలూ అన్నాడు.

ఈ లోపల ధర్మరాజు తన కున్నదంతా ఓడాడు; బ్రాహ్మణ మాన్యాలు తప్ప తన కున్న రాజ్యాన్నీ, బ్రాహ్మణులు కాక తన మిగతా ప్రజలనూ, తనకు సామంతులైన రాజపుత్రులనూ ఓడాడు. శకుని పాచికలను ధర్మరాజు ముందు వేసి, "పణంగా పెట్టటానికి నీ కింకేమీ లేదు!" అన్నాడు.

ధర్మరాజు సహదేవుణ్ణీ, నకులుణ్ణీ పణం పెట్టి, ఇద్దరినీ పోగొట్టుకున్నాడు. తరవాత అర్జునుణ్ణీ, భీముణ్ణీ కూడా ఓడి, తనను తానే పణంగా పెట్టుకుని ఆ పందెం కూడా ఓడాడు. [అట్టమీది బొమ్మ]

"నీ సొత్తు ద్రౌపది ఉన్నది గదా? ఆమెను పందెంగా పెట్టు," అన్నాడు శకుని. ధర్మరాజు ఆ పని కూడా చేశాడు.

దీనితో సభలో కలకలం పుట్టింది. కౌరవుల కిదేం పొయ్యేకాలం అన్నారు కొందరు. భీష్మ ద్రోణ కృపులు మాత్రం ఏమీ మాట్లాడలేదు. విదురుడు బుసలు కొట్టుతూ ఉండిపోయాడు. కర్ణ దుశ్శాసనుల ఆనందం అంతా ఇంతా కాదు.





# శివపురాణం

సృష్టికి పూర్వం ప్రపంచం జలమయమై, పదార్థశూన్యమై, అంధకారంలో ఉండగా జలం నుంచి ఒక మహా తేజస్సు పుట్టింది. కాలక్రమాన అది జ్యోతిర్లింగ స్వరూపం దాల్చింది. అదే పరమేశ్వరుడైన శివుడు. ఆ జ్యోతిర్లింగం యొక్క అర్ధభాగం నుంచి మహాశక్తి పుట్టింది. ఆ మహాశక్తినే ప్రకృతి అనీ, మహామాయ అనీ పిలుస్తారు.

కాలక్రమాన పరమేశ్వరీ పరమేశ్వరులు మహావిష్ణువును సృష్టించారు. మహావిష్ణువు నాభి నుండి మహాపద్మం పుట్టింది. అది అనేకవేల యోజనాల నిడివి గలిగి మహా ఆశ్చర్యకరంగా ఉన్నది. ఆ మహాపద్మంలో అయిదు ముఖాలతో బ్రహ్మ పుట్టాడు. ఆ బ్రహ్మతో బాటే సరస్వతి పుట్టింది.

ప్రపంచమంతా జలమయంగా ఉండటం గమనించి బ్రహ్మ తనకు జన్మస్థానమైన మహాపద్మం అంతు తెలుసుకోవాలని ఊర్ధ్వ అధోలోకాల మధ్య అనేక ప్రయాణాలు చేసి తిరిగి పద్మగర్భం చేరుకున్నాడు. బ్రహ్మ ఓంకారాన్ని జపించగా దాని ఫలితంగా విష్ణువు బ్రహ్మ ఎదట ప్రత్యక్షమయాడు. తానే సృష్టిలో మొదటివాణ్ణి అనుకుంటున్న బ్రహ్మ విష్ణువును చూసి, "ఎవరు నువ్వు? ఇక్కడికెందుకు వచ్చావు?" అని అడిగాడు.

"సృష్టి చేయటానికి నిన్ను నా నాభికమలం నుంచి పుట్టించాను. నేను విష్ణువును," అన్నాడు విష్ణువు.

బ్రహ్మ అహంకరించి, "నీ ప్రగల్భాలు కట్టిపెట్టు. లేదా నాతో యుద్ధానికిరా. నేను స్వయంభువును, జగత్కర్తను," అన్నాడు.

అప్పుడు విష్ణువు ధ్యానించగా పరమేశ్వరుడు జ్వాలాలింగ రూపంలో బ్రహ్మ విష్ణువుల మధ్య ప్రత్యక్షమయాడు. అప్పుడు విష్ణువు బ్రహ్మతో, "దీని ఆద్యంతాలు

అట్ట చివరి బొమ్మ



మనిద్దరిలో ఎవరు కనుక్కుంటె వారు గొప్ప," అన్నాడు. బ్రహ్మ అందుకు సమ్మతించాడు. కాని ఆ ప్రయత్నంలో ఇద్దరూ ఓడిపోయి యథాస్థానికి తిరిగి వచ్చి, పరమేశ్వరుణ్ణి ప్రార్థించారు.

పరమేశ్వరుడు వారి ఎదట ప్రత్యక్షమై, "నువు పంచభూతాత్మకమైన ప్రపంచాన్ని సృష్టించటానికి గాను ఈ విష్ణువు యొక్క నాభికమలం నుంచి సృష్టించబడినవాడివి. అందుచేత సృష్టి ఆరంభించు," అని బ్రహ్మతో అన్నాడు.

బ్రహ్మ పరమేశ్వరుణ్ణి చూసి, "నువు ఎవడివి? నాతో సమంగా నీకు అయిదు ముఖా లెందుకున్నాయి? నేను సృష్టికర్తను గనక నాకు అయిదు ముఖాలుండటం సమంజసం!" అన్నాడు.

ఆ మాటలు విని పరమేశ్వరుడు రుద్రావతారం దాల్చి, తన ఎడమచేతి చిటికెనవేలి గోరును కత్తిగా ఉపయోగించి, బ్రహ్మకున్న అయిదు తలలలో ఒకటి ఖండించేశాడు. దానితో బ్రహ్మ గర్వం మాని, రక్షించమని పరమేశ్వరుణ్ణి ప్రార్థించాడు.

పరమేశ్వరుడు రౌద్రం వదిలి శాంతం వహించి, "ఓ బ్రహ్మ, సృష్టించటానికి నువ్వూ, నీ సృష్టిని రక్షించటానికి ఈ విష్ణువూ సృష్టించబడ్డారు. నేను లయకారకుడైన శివుడుగానూ, రుద్రుడుగానూ, ఈశ్వరుడుగానూ పిలవబడతాను. జ్వాలాలింగాన్నే పార్థివలింగమనీ, శివలింగమనీ పూజించండి," అని చెప్పి ఆ జ్వాలాలింగంలో ఐక్యమయాడు.

తరవాత బ్రహ్మ విష్ణువు నుంచి వేదం మొదలయినవి తీసుకుని, పద్మాసనం మీద కూర్చుని ఓంకారాన్ని జపిస్తూ ఉండగా, నీటి మీద తేలుతూ ఒక గుడ్డు బ్రహ్మ కేసి వచ్చింది. బ్రహ్మ దాని కేసి ఆశ్చర్యంగా చూశాడు. అంతలో ఆ గుడ్డు నుంచి 'ఓం' అనే శబ్దం బయటికి వచ్చింది. అది వచ్చిన మార్గాన బ్రహ్మ ఆ అండంలో ప్రవేశించాడు. అందులో గాఢాంధకారంగా ఉన్నది. బ్రహ్మ అక్కడ తన శరీరాన్ని విసర్జించి,

చతుర్ముఖుడుగా తిరిగి పుట్టాడు. బ్రహ్మ అండం నుంచి బయటికి వచ్చినప్పుడది రెండుగా చీలి, కింది భాగం భూమిగానూ, పై భాగం ఆకాశంగానూ ఏర్పడింది; నీరు ఇంకిపోయింది.

ఇది చూసి బ్రహ్మ చాలా సంతోషించి భూమి మీద సమస్త చరాచరాలను సృష్టి చేయ నారంభించాడు. బ్రహ్మ సృష్టి చేసిన మొదటి వాళ్ళు సనకసనందనాదులు. వాళ్లు సృష్టి చేసే ఆసక్తి లేక, పరమేశ్వరుణ్ణి ధ్యానిస్తూ తపస్సు చేసుకునేటందుకు వెళ్ళిపోయారు. అది చూసి బ్రహ్మ ·గట్టిగా ఏడ్చాడు. ఆయన కన్నీరు భూమి మీద పడగా అందులో నుంచి గొప్ప తేజస్సుతో శివుడు పుట్టాడు. అతను తెల్లగా ఉండి, దశదిశలనూ వెలిగిస్తూ ఉండటం చూసి బ్రహ్మ, " ఎవరు నువు ? " అని అడిగాడు.

"నేను శివుణ్ణి, రుద్రుణ్ణి," అన్నాడు శివుడు.

అప్పుడు విష్ణువు ప్రత్యక్షమై, " బ్రహ్మ! నువు సృష్టించి నేను పోషించే చరాచరాలను లయం చెయ్యటానికి పరమేశ్వరుడే ఈ శివుడి రూపంలో పుట్టాడు," అన్నాడు.

బ్రహ్మకు సత్యలోకమూ, విష్ణువుకు వైకుంఠమూ, శివుడికి కైలాసమూ వాసస్థానాలుగా ఏర్పాటయాయి. అందుచేత బ్రహ్మ సత్యలోకానికి వెళ్ళి, తనకు సహా



యంగా ఉండటానికిగాను, మరీచి, కశ్యప, దక్ష, గౌతమ, వసిష్ఠ, కర్దమ మొదలైన తొమ్మిదిమంది ఉపబ్రహ్మలను సృష్టించాడు.

వీరిలో దక్షుడికి అరవైనలుగురు కుమార్తెలు కలిగారు. ఆ కుమార్తెలలో అదితి మొదలైన పదిమందిని కశ్యపుడు పెళ్ళాడి పిల్లలను కన్నాడు. అదితికి ఇంద్రుడు మొదలైన దేవతలు పుట్టారు; దితికి దైత్యులు పుట్టారు; వినతకు గరుత్మంతుడూ, అనూరుడూ పుట్టారు; కద్రువకు సర్పాలు పుట్టారు; స్వసకు యక్ష, రాక్షసులు పుట్టారు.

శివుణ్ణి పెళ్ళాడటం కోసం మహేశ్వరి దక్షుడికి సతి అనే కుమార్తెగా పుట్టింది. వారిద్దరికి వివాహం జరిగినప్పుడు బ్రహ్మ,

విష్ణువూ, ఇంద్రుడు మొదలైన దేవతలూ వచ్చి, సతీశివులను అనేక విధాల స్తోత్రం చేశారు. వచ్చినవారి కందరికీ గౌరవ మర్యాదలు చెయ్యటానికి నందీశ్వరుణ్ణీ, కాల భైరవుణ్ణీ నియమించి, శివుడు సతీసమేతుడై కైలాసానికి వెళ్ళి సుఖంగా ఉన్నాడు.

కొంత కాలం గడిచింది. అనేకమంది మహామహులు ప్రయాగ అనే నగరంలో గొప్ప యాగం తలపెట్టి, బ్రహ్మ విష్ణు మహేశ్వరులనూ, ఇంద్రాది దేవతలనూ పిలిచి, యాగం ప్రారంభించారు.

యజ్ఞానికి వచ్చిన వారికి వసతులు ఏర్పాటు చేసి, మహర్షులు వారివారికి తగిన ఆసనాలు చూపి కుర్చోబెట్టారు. అందరూ కూర్చుని యజ్ఞాన్ని చూస్తూండగా దక్షుడు తన శిష్యులతో సహా వచ్చాడు. అప్పుడు సభలోని వారందరూ లేచి దక్షుడికి ఎదురు వెళ్ళి పలకరించి తీసుకువచ్చి కూర్చోబెట్టారు. దక్షుడు సభ నంతా కలయజూసి, బ్రహ్మ విష్ణులకు నమస్కారం చేసి, తన అల్లుడైన శివుడు లేవలేదనీ, తనను పలకరించలేదనీ గమనించి సభవారితో, "మీరందరూ లేచి వచ్చి నన్ను గౌరవించారు. ఈ ఈశ్వరుడు నాకు అల్లుడైన కారణం చేత, లేవక, నన్ను పలకరించక నిర్లక్ష్యం చేశాడు. ఇతనికి చిన్నా పెద్దా తారతమ్యం తెలీదు," అని తన శిష్యులతో సహా వెళ్ళిపోసాగాడు.

అది చూసి బ్రహ్మ, విష్ణువూ మొదలైన వాళ్ళు దక్షుడికి అడ్డం వెళ్ళి, "అతను ఈశ్వరుడు. పరమేశ్వరావతారుడు. అతన్ని నిందించటం తప్పు," అని చెప్పారు.

అప్పుడు నంది దక్షుడితో, "ఓ దక్షా, శివదూషణ చేసిన నీ శిరస్సు తెగి హోమ గుండంలో పడుగాక!" అని శపించాడు.

అది విని దక్షుడు అలిగి, "మీ రుద్ర గణాల వాళ్లు వేదబాహ్యులై, ఆచార హీనులై, బూడిద పూసుకుని, పాషండులని పేరు తెచ్చుకుందురుగాక!" అని తిరిగి శపించాడు.

శివుడు యజ్ఞం పూర్తి అయే దాకా ఉండి, తన రుద్రగణాలను వెంటబెట్టుకుని కైలాసానికి వెళ్లిపోయాడు.



# 111. "రొట్టెల దొంతర" రాళ్ళు

సుమారు 5 కోట్ల ఏళ్ళ క్రితం సముద్రం అడుగున సున్నపు నలుసులు పేరుకుంటూ వచ్చి, అవి కాలక్రమాన సముద్ర మట్టం దాటి పైకి వచ్చాయి. కాలక్రమాన వర్షపు నీరు దుర్బలంగా ఉన్న పదార్థాన్ని కరిగించటం చేత ఇలా పొరలు ఏర్పడ్డాయి. ఈ చిత్రంలో చూపిన "రొట్టెల దొంతర" శిలలు న్యూజీలాండులోని దక్షిణ దీవిలోనివి. ఇలాంటి శిలల దొంతరలు ప్రపంచంలో ఇంకా కొన్ని చోట్ల ఉన్నాయి. కాని ఇంత బల్లపరుపుగా లేవు. వీటి మధ్య సముద్రజలం "గూళ్ళు" తొలిచింది.



Photo by Bhalchandra Kadne



బహుమతి
పొందిన వ్యాఖ్య

అంతేలే పేదల బ్రతుకులు

పంపినవారు:
శిలపరశెట్టి, ఖర్గపూర్

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

గాలానికి చిక్కిన చేపలు

పంపినవారు:
శిలపరశెట్టి, ఖర్గపూర్

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1971 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అంతేలే పేదల బ్రతుకులు
రెండవ ఫోటో : గాలానికి చిక్కిన చేపలు

పంపినవారు : శిలపరశెట్టి 'సనారా',
ఖర్గపూర్.

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# మీ సొమ్ముకు సమృద్ధిగా

# బ్రిటానియా బ్రిటా

# బిస్కట్లు





# టివియస్ రిట్రెడులు భద్రత నిస్తాయి

టివియస్ రిట్రెడ్‌లు క్రొత్త టైరులులాగే కన్పిస్తాయి. రిట్రెడింగ్ విధానంలో ప్రత్యేకంగా మేము తీసుకొనే జాగ్రత్తలు క్రొత్త టైరులులాగ కన్పించడానికిగాదు. క్రొత్త టైరులాగ మంచి రోడ్డు గ్రిప్పును ఇచ్చేటట్టు చూస్తాము అవి చాలాకాలం క్రొత్తవిలాగ మన్నుతాయి.

టివియస్‌కు ఇచ్చే ప్రతీ టైరూ కూడా ట్రెడ్‌ను పదులుచేసే ఇసుక రేణువులు లేక సున్నితమైన ఇతర బాహ్య పదార్థాలు లేకుండా ఒకసారి. రెండుసార్లు పరీక్ష చేయబడుతుంది. అత్యాధునికమైన రిట్రెడింగ్ మెషీనులమీద మంచి నైపుణ్యతగల సాంకేతిక శిల్పంది పనిచేస్తారు. మీకు తెలుసా బాగా మన్నడానికని

టివియస్ క్యామెల్ బ్యాక్ రబ్బరును వారే తయారుచేసుకుంటారు ఆశ్చర్యములేదు టివియస్ రిట్రెడులు ఇతర వాటికంటె మీరు వెచ్చించే ప్రతీ రూపాయికి అధికంగా టైరు మైళ్లనిస్తాయి.

మీరు టివియస్‌ను విశ్వసించవచ్చు—
భారతదేశంలో పెద్ద రిట్రెడ్ వ్యాపారస్థులు.





మీరు
టివియసిని
విశ్వసించగలరు

సుందరమ్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్
బెంగళూరు-కోయంబత్తూరు-కలమసేరి-మద్రాసు-పుదుకోటై-సేలం-సికింద్రాబాద్-తిరునెల్ వేలి-విజయవాడ.

SI 6073



# తియ్యని మామ

చందమామ రావె జాబిల్లి రావే!
కొండెక్కి రావె **న్యూట్రిన్** మిఠాయి తేవే!
చెపలాయ్ నడిగి తేవే!
**న్యూట్రిన్** టాఫీ తేవే!
తేరుమీద రావే! **న్యూట్రిన్** కాండీ తేవే!
క్ర్యాబ్, క్రంచ్, నావల్టీ
కూడా పట్టుక రావే!
చందమామ రావే!
**న్యూట్రిన్** మిఠాయి తేవే!






న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, చిత్తూరు (ఆం.ప్ర)

NCM-18 TEL

# ఇతను శంకర్

కుటుంబమునకు పెద్ద • చురుకుగా వుంటాడు • సరదాగా వుంటాడు



# "అదే, అసలైనదే నాకు కావాలి"

శంకర్ రోజంతా శక్తి ఉత్సాహములతో వుండాలని కోరుతున్నారు. దానికోసం అతని భార్య ప్రతి రోజు అతనికి "హార్లిక్స్" ఇస్తుంది. "హార్లిక్స్"లో పూర్తి మీగడ గల పాలు, ఉత్తమమైన గోధుమ మరియు ఆరోగ్యకరమగు ఇతర పదార్థములు వున్నాయి. డాక్టర్లు 8 సంవత్సరముల పైగా "హార్లిక్స్"ను సిఫారసు చేస్తున్నారు. మీరు, మీ కుటుంబములోని వారు, ఉత్సాహముతో వుండండి — ప్రతి రోజు "హార్లిక్స్" త్రాగండి.




## అదే, అసలైనదే 'హార్లిక్స్'




నమలండి

# చిక్లెట్స్ చూయింగ్ గమ్,

తెలుసుకోండి వాటి మజా

ఊరూర తిరుగుతూ తెచ్చాడు చిక్లెట్స్ బఫూన్
మీ లాంటి పిల్లలకు చిక్లెట్స్ చూయింగ్ గమ్
మీరు ఎరుగని నాల్గు క్రొత్త చూయింగ్ గమ్ రుచులతో
ఆరంజ్, లెమన్, పెప్పర్‌మింట్, టూటి-ఫ్రూటి.

